శ్రీ కృష్ణపరమగురుభ్యోనమః.



# శ్రీ వెలుగోటి

# సర్వజ్ఞకుమారేచేంద్రభూపాల

విరచితంబైన

# శ్రీగీతార్థసారసంగ్రహము

అనుతత్వగ్రంథము

తత్కృత

## సారాంశపంచక

గ్రంథముతోడ

ఆదిసరస్వతీనిలయముద్రాక్షర

శాలయందు

ముద్రింపఁబడియె.

చెన్నపురి.

౧౮౮౬ సం॥

ఓం

శ్రీకృష్ణోజయతి.

శ్రీగీతార్థసారసంగ్రహ విషయానుక్రమసూచిక.


| పుటసంఖ్య. | విషయములు. |
|---|---|
| ౧ | ఉపోద్ఘాతము. |
| | ముఖ్యమయినవిద్యలు. |
| ౨ | గ్రంథకర్తప్రయాస. |
| | త్రిమతస్థదోషములు. |
| ౩ | మతములయందలిపరస్పరవిరోధములు. |
| ౪ | గ్రంథోత్పత్తినిమిత్తము. |
| ౫ | కారణమయినబ్రహ్మస్వరూపనిరూపణము. |
| ౬ | సృష్టివిషయము. |
| ౭ | జీవుఁడంతఃకరణ ప్రతిబింబము కాదనుట. |
| ౮ | ప్రపంచముభ్రాంతికల్పితముకాదనుట. |
| ౧౩ | ప్రపంచము సత్యముకాదనుట. |
| ౨౧ | జన్మాంతరముగలదనుట. |
| ౨౮ | జీవోత్పత్తివినాశములవిషయము. |
| ౩౨ | నిర్గుణబ్రహ్మముసగుణమగువిధము. |
| ౩౫ | నిర్గుణశబ్దార్థ నిర్ణయము. |
| ౩౮ | ప్రపంచమునకు బ్రహ్మమభిన్న నిమిత్తోపాదాన కారణమనుట. |
| ౪౦ | బ్రహ్మమునకవస్థాత్రయము. |

| పుటసంఖ్య. | విషయములు. |
|---|---|
| ౪౧ | అవతారనిమిత్తము. |
| ౪౨ | రామకృష్ణాదులుభగవదవతారములనుట. |
| | జీవులందుజ్ఞానానందసర్వశక్తులుగలవనుట. |
| ౪౪ | నిరీశ్వర వాద నిరాకరణము. |
| ౪౫ | కర్మకారణత్వవాదఖండనము. |
| ౪౭ | భగవంతునిముఖ్యోపాసనలు. |
| | విగ్రహారాధనచే భగవత్ప్రీతిగల్గుననుట. |
| ౫౦ | ఒకడయ్యుభగవంతుడుసర్వవ్యాపకుడనుట. |
| ౫౧ | సర్వదేవతారూపుడై భగవంతుడేయాఫలములనిచ్చుచున్నాడనుట. |
| ౫౪ | సర్వజనంబులు నుపాసింపదగినమార్గము. |
| ౫౫ | పరధర్మమునకంటె స్వధర్మముశ్రేష్ఠమనుట. |
| ౫౬ | సర్వమతసాధారణధర్మములు. |
| ౫౭ | అధమజాతులకును మోక్షముగలదనుట. |
| ౬౦ | భగవంతుని నమ్మినందుకనుభావములు. |
| ౬౧ | మానసికపూజ సర్వసులభమనుట. |
| | నామకీర్తనకు నియమాపేక్ష లేదనుట. |
| ౬౨ | సర్వజాతి సాధారణ ధర్మమయిన యన్నదానముత్తమమనుట. |
| ౬౩ | ఎల్లెడభగవద్విషయమతిశ్రేయస్కరమనుట. |
| ౬౪ | కలియుగమందు భగన్నామకీర్తనము ముఖ్యమనుట. |
| ౬౫ | నామాపరాధదశకము. |

| పుటసంఖ్య, | విషయములు. |
|---|---|
| ౬౫ | నామస్మరణయంతిమస్మృతినిగలిగించుననుట. |
| ౬౭ | శివకేశవభేదనిరాకరణము. |
| ౬౯ | ధర్మశబ్దతాత్పర్యనిర్ణయము. |
| ౭౧ | నామస్మరణ బ్రహ్మాద్వితీయజ్ఞానతుల్యమనుట. |
| | నవవిధభక్తులు. |
| ౭౨ | కర్మయోగముకంటెనామస్మరణ ముఖ్యమనుట. |
| ౭౩ | రామనామప్రభావము. |
| ౭౪ | భగవంతునికంటెభగవన్నామమే యుత్తమమనుట. |
| ౭౬ | రాగద్వేషవశులై చేసినపాపములునుభగవన్నామ స్మరణమువలన బోవననుట. |
| ౭౮ | భగవన్నామమహిమవేదోక్తమనుట. |
| | జపమాలికాప్రయోజనము. |
| ౭౯ | కలిలోశ్రీకృష్ణనామముశ్రేష్ఠమనుట. |
| ౮౧ | శ్రీకృష్ణుడుభగవంతుడనుట. |
| ౮౨ | అన్నింటిలోసంస్కృతమయ వేదము ముఖ్యమనుట. |
| ౮౪ | భగవదనుగ్రహముచేప్రారబ్ధమును నశించుచున్నదనుట. |

| పుటసంఖ్య. | విషయములు. |
|---|---|
| ౮౭ | ప్రారబ్ధనాశమునుగూర్చిప్రక్షిప్తములు చేయునాక్షేపమునునిరసించుట. |
| ౮౮ | భగవన్నామమహిమఅర్థవాదముకాదనుట. |
| ౯౦ | సర్వజనంబు లంగీకరింప దగినముఖ్యాంశములు ౬ |
| ౯౧ | బాహ్యామలనివృత్తియె శౌచరూపాచారమనుట. |
| ౯౩ | ధర్మాధర్మస్వరూపనిర్ణయము. |
| ౯౪ | ఈగ్రంథాభిప్రాయమునెఱుంగనివారు. |
| | భగవత్తత్వమునెవ్వరెఱుంగరనుట. |
| ౯౫ | ఈగ్రంథము భగవన్మతానుసారియనుట. |
| ౯౬ | సారాంశపంచకమనుగ్రంథము. |

శ్రీరాధాకృష్ణార్పణమస్తు.





### శ్రీ కృష్ణో జయతి.



### శ్రీ రాధాకృష్ణాయనమః.

### శ్రీ గోపీజనవల్లభాయనమః.



# శ్రీ గీతార్థ సారసంగ్రహము.

## ఉపోద్ఘాతము.

వసుధలో యోగ్యములైన విద్యలనేకములుగలవు. వాటినన్నిటిని సాధించుటకు నెంత బుద్ధిమంతునకైనను శక్యము గాదు.

## ముఖ్యమైనవిద్యలు.

అయితే, యీవిద్యలలో ముఖ్యముగ, సద్వారకముగా నైహికాముష్మిక పురుషార్థ సాధనములైన విద్యలు రెండుగలవవి యెవ్వియనిన, నైహికఫలములలో స్త్రీపురుషులకు బ్రహ్మానందలేశసన్నిభమై భగవల్లీలా రూప ప్రపంచమునకు వృద్ధికరమైన రతివిద్యయు, నాముష్మిక ఫలములలో ముఖ్యమైన మోక్షమునుగలుగజేసెడి సర్వవిద్యాసారమయిన యధ్యాత్మ విద్యయు, నీరెండుగా నున్నవి. ధర్మార్థకామమోక్ష రూప చతుర్విధ పురుషార్థములలో సుఖరూపములయిన కామమోక్షరూప పురుషార్థములకు అర్థ ధర్మములు సాధనములయినవి. మరియు నెంతద్రవ్యవంతులకైన, నెంత బుద్ధిమంతులకైన, నెంతశక్తిమంతులకైనను నితరవిద్యలవలె, సద్వారకములుగ గాకుండ సాక్షాత్తుగానే సాధించదగినవియునైనవి గావున సర్వజనులకు నత్యం

# శ్రీ గీతార్థసార సంగ్రహము.

## గ్రంథకర్త ప్రయాస.

తాపేక్షితములై యున్నవి కావున, వెలుగోటి బంగారేచేంద్ర పుత్రుండును. శ్రీకృష్ణదాసుండును సర్వజ్ఞ కుమార యాచేంద్రాభిధానుండును నగునేను. ఈవిద్యలను ప్రతిపాదించునట్టి యనేకగ్రంథములను జూచి చక్కగ పెద్దల వలన బోధ పరచుకొని బహుదినములు పరిశీలించి మొదలశృంగార రహస్యములను మా యాస్థాన కవీశ్వరులయిన గోపినాథం వెంకయ్యశాస్త్రుల వారికి చక్కగ దెలియజేసి వారి వలన శృంగార రస ప్రధానమైన బ్రహ్మానంద శతకమును. సీసపద్యములుగ జెప్పించినార మాపద్యములలో నుండెడిభావ మిప్పటి జనులకుచక్కగ బోధపరుచు కొనునట్టి యోగ్యత లేకపోయినందున. నధ్యాత్మ విషయమైన యీ గీతార్థసార సంగ్రహ మనెడు గ్రంథమును పద్యరూపముగ జేయించక. నందరికి దెలియుటకు నింగిలీషు గ్రంథము రీతిగ వచన కావ్యంబుగ తెనుగు మాటలతో రచించు చున్నాడను.

## త్రిమతస్థదోషములు.

వైదికమతములని పేరుగల యద్వైత విశిష్టాద్వైత ద్వైతమతములుగలవారు. చిదచిదీశ్వరు లనాదులని యొప్పుచున్నారు, గనుక, నాదిలేనివాటి కంతము గలుగదు. గావున నెప్పుడు నిమ్మూటికి నిత్య భేదమునే యీత్రిమతస్థులు నొప్పవలసి యుంటున్నది.

అయితే, యద్వైతులు మోక్షమందు భ్రాంతి కల్పిత మయిన యుపాధినాశమై జీవేశ్వరుల కైక్యముగలుగుచున్నదనిమాత్రము చెప్పుచున్నారు. ఉపాధులుభ్రాంతికల్పితము లయినను, తద్భ్రాంతికైన నాది లేనిమొదల నదియును నిత్యమే యగుచున్నది, గనుక దానికి యంత మెక్కడిది. ఇందువలననద్వైతమనెడి మాటమాత్రము శేషించుచున్నది. విశిష్టాద్వైతులుచిదచిత్తు లపృథక్సిద్ధవిశేషణములనియు, తద్విశి

ష్టుడుబ్రహ్మమనియుజెప్పటయేగాని, మోక్షమునందును చిదచిదీశ్వరులు వేరువేరుగానే యుంటున్నారని చెప్పటవలన వీరలకునువిశిష్టాద్వైత మనెడి మాటమాత్రము శేషించు చున్నయది. ద్వైత మతస్థులుమాత్ర మెప్పుడును చిదచిదీశ్వరులకు భేదమునే చెప్పటవలన యుక్తిచేత నీశ్వరానవస్థగలుగుచున్నయది.

అయితే, భిన్నము లయిన చిదచిత్తుల కీశ్వరుం డొకడేయని చెప్పటకు శాస్త్రంబే ప్రమాణ మనిన యెడల యుక్తినేగోరు పరమతస్థులీమాట కొప్పుకొన రింతియేగాక, ప్రత్యక్షములో భేదరూపముగాగనుపడెడు ప్రపంచమును మరల శాస్త్రములో భేదమని చెప్పటకు కారణమేమి. తల్లి బిడ్డనికైనను, దెలియని యర్థమునే దెలుపుగాని, తెలుసుకొనినయర్థమును మరలనేల దెలుపును. గనుక భేదముగదెలియ వచ్చు నీప్రపంచమంతయు నభేదమనియే శాస్త్రమునకు భావముగాని యెప్పుడును భేదమనిభావముగాదు.

## మతములయందలిపరస్పరవిరోధములు.

ఇదియునుంగాక, యనేక మతస్థులనేక విధంబులుగ జెప్పుచున్నారవి యెట్లంటేని. బ్రహ్మము గలదనియు, లేదనియు, సగుణమనియు, నిర్గుణమనియు, సవికారమనియు, నిర్వికారమనియు, జీవేశ్వరులకు భేదమనియు, నభేద మనియు, చిదచిదీశ్వరులకు భేద మనియు, నభేద మనియు, జీవుడుపాధ్యవచ్ఛిన్నమయిన బ్రహ్మలేశమనియు, నుపాధిప్రతిబింబ మనియు, జీవుడు స్వతంత్ర కర్త యనియు, పర తంత్ర కర్తయనియు, జీవునకు జన్మాంతరముగలదనియు లేదనియు, జీవునకు గలిగెడి సుఖదుఃఖములను పూర్వజన్మకర్మాధీనముగ నీశ్వరుడిచ్చుచున్నాడనియు, నీశ్వరుండే స్వతంత్రముగా నిచ్చు చున్నాడనియు, జీవుని కర్మమే సుఖదుఃఖముల నిచ్చుచున్నదనియు, వానివాని జాతక ప్రకా

రము నవగ్రహములు తమతమ దశలయందాయా ఫలముల నిచ్చుచున్నవనియు, జగంబుసత్యమనియు, మిథ్యయనియు, క్షణికమనియు, విగ్రహారాధనము జేయవచ్చుననియు, జేయగూడదనియు, జగంబునకు బ్రహ్మకారణమనియు, విష్ణువుకారణమనియు నీశ్వరుడుకారణమనియు, శక్తికారణమనియు, సూర్యుడుకారణమనియు, నగ్నికారణమనియు, వినాయకుడు కారణమనియు, కర్మము కారణమనియు, పరమాణువులు కారణమనియు, ఖుదా కారణమనియు, యెహోవా కారణమనియు, మోక్షోపాయములనేక విధములనియు, మోక్షంబు లనేకవిధంబులుగ గలుగుచున్నవనియు, నివిమొదలయిన యంశములలో గొన్ని తర్కసహితములైనా అన్యోన్యమతస్థులభ్యాసముచేత మరిగినందున ననేక విధంబుల పరస్పరవిరుద్ధములుగ జెప్పుచున్నారు. ఇందుకుదృష్టాంతము, ఏప్రయోజనములేని దుర్గంధమయిననస్యమునభ్యసించినవాడెప్పుడును, పడిసెపు బాధనైన ననుభవించుచువిడువజాలక నీచులనైన యాచింపుచు దాన్ని శ్లాఘింపు చున్నట్లు. చెప్పుదురు. ఇంతయేగాక, యనేకదేశములలో ననేకభాష లనేకమతములనేకాచారము లనేక ధర్మములు పరస్పర విరుద్ధములుగ నున్నవి.

అయితే, యవితప్పనుటకు నన్ని మతములలోనును గొందరు మహిమగలవారైయున్నారు. గావున కేవలము తప్పనగూడదు.

## గ్రంథోత్పత్తినిమిత్తము.

గనుక నిటువంటి యనేకవిరోధ పరిహార పూర్వకముగ తత్వనిర్ణయముజేసి భగవంతునిచేత గీతాశాస్త్రము జెప్పబడినందున నందలి తత్వములువాటి కవిరుద్ధములయిన యితర తత్వశాస్త్రములలోనుండెడి యంశములు, ఈశ్వరప్రేరణచేత నాబుద్ధికి గోచరించిన ప్రకారమిందులో వివరింపబడుచున్నయవి.

## కారణమైనబ్రహ్మస్వరూపనిరూపణము.

సత్యజ్ఞానానంద స్వరూప మయినది నిర్గుణ బ్రహ్మమని యుపనిషత్తుల యందును యితిహాసపురాణములయందును జెప్పబడియున్నది. నిరాలంబోపనిషత్తులో బ్రహ్మ మెద్దియనెడు ప్రశ్నమునకు సమాధానములో మహదహంకార పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మకమయిన బృహద్రూపమైన యండకోశముచేత, కర్మజ్ఞానములకు ప్రయోజనమగుటచేత, ప్రకాశించుచున్నట్టిదియు, నద్వితీయమైనట్టిదియు,సకలోపాధివినిర్ముక్తమైనట్టిదియు, సర్వశక్త్యుపబృంహితమయినదియు, ననాద్యంతమయినదియు, శుద్ధము, శివము, శాంతము, నిర్గుణమిత్యాదులచేత జెప్పదగినదియును నిర్వాచ్యమయినదియు నైన చైతన్యమే, బ్రహ్మమనిజెప్పబడియున్నది. ఇందులోసర్వశక్త్యుప బృంహితమనుటకుగుణరూపములయిన సర్వశక్తులతోగూడినదని యర్థము జెప్పినయెడల నందుకు పూర్వోత్తరముల యందున్న సకలోపాధివినిర్ముక్తం, నిర్గుణమిత్యాది విశేషణములకు విరోధము వచ్చును గనుక, సర్వశక్తే స్వరూపమని యర్థము జెప్పవలయు నదిగావున నిచ్చోట, నిర్గుణబ్రహ్మమునకు సర్వశక్తి స్వరూపము జెప్పబడినది. సర్వశక్తులును సత్యజ్ఞానానందములయందంతర్భూతములైనవిగావుననితరోపనిషత్తులు మొదలయినవాటిలో ప్రత్యేకముగ సర్వశక్తిస్వరూపమని చెప్పబడలే దెట్లంటేని. సత్యమనగ త్రికాలముల యందు నుండుట, జ్ఞాన మనగ త్రికాలములయం దఖండముగనుండునట్టి జ్ఞానము గావున భూతభవిష్యద్వర్తమానకాలములలో తనచేతనభిన్ననిమిత్తోపాదాన కారణరీతిగ జేయబడెడు సృష్టి స్థితి ప్రళయంబులు, నందుల క్రమంబులును, జీవులకు ప్రారబ్ధ ప్రకారము సిద్ధముగ జరగబొయ్యెడియంశంబులును, వీటిలోనెద్దిదెలియకపోయిన నఖండజ్ఞానమునకు సంకోచమువచ్చునుగనుక, త్రికాలములయందునసంకుచితజ్ఞానస్వరూపమని తాత్పర్యము.. అందువలనజ్ఞానశక్తియునిందులో నంతర్భూతము.

అయితే, అట్టి ప్రారబ్ధారంభకములయిన జీవుల కర్మములు దేవునికి ముందుగ దెలియవాయనియం టేని. దేవుడువిధిశాస్త్రములను గల్పించి జీవులకు కొంత స్వాతంత్ర్యిము నిచ్చినందునవారు స్వేచ్ఛతో జేయబోయెడునని శ్చితములైనకర్మములుముందుగ దెలియుటకుయుక్తి గనుపడలేదు. అట్టికర్మములను ముందుగ తెలుసుకొని యుండెనేని యవియుపూర్వమే నిర్ణీతములై యుండవలయుగావున విధి శాస్త్రములకుప్రయోజనము లేదు. ఆనందమనగ ద్రికాలములయం దఖండముగ నుండెడినిరవధికసుఖముగావునతనయిచ్ఛానుసారముగ నేపదార్థమును సృజించ లేకపోయినను యశక్తిద్వారా నిరవధికానందమునకు సంకోచముగలుగును గనుక నిచ్ఛాక్రియా శక్తులిందులో నంతర్భూతములు. ఇతర సర్వ శక్తులును, జ్ఞానేచ్ఛాక్రియాశక్తుల యవాంతర భేదములే గనుక, నిమ్మూటి చేతనే సర్వశక్తిస్వరూపమున్ను లభించి నందున ప్రత్యేకముగ నక్కడక్కడ జెప్ప బడలేదు. ఇటులనే యీమూడింటిలో నొక దాని చేతనే యీమూటియర్థమున్ను లభించు చున్నది. అద్దైనా వాచ్యార్థమును వదలి లక్షణచేతనే కారణమును, బోధించుచున్నది. ఈ యంశము అద్వైత మకరందవ్యాఖ్యానములో వివరింప బడియున్నది. అయితే లోకులకు సులభముగా దెలియుటకు లోకానుభవ సిద్ధములయిన సత్యజ్ఞానానందములు కారణబ్రహ్మమునకుస్వరూపమనిచెప్ప బడినది.

## సృష్టివిషయము.

తైత్తిరీయోప నిషత్తునం దానంద వల్లిలో నాత్మ బహువిధములుగనైవుట్టెదనని కోరి యోచించి సమస్తజగంబులసృజించి యందులో దాను ప్రవేశించి సదసత్తులాయెను, విజ్ఞానము, అవిజ్ఞానము, సత్యము, అనృతము, సత్యమాయెను. ఎద్దియెద్ది యున్నదో. యది యంతయు

సత్యమని చెప్పియున్నది, గనుక నీప్రకారము బ్రహ్మంబు లీలార్థము తానే యనేక విధములుగ నయ్యెదనని యిచ్ఛయించి గీతాశాస్త్రము సప్తమాధ్యాయ మందలి ॥ ( శ్లో ॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ । అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టధా॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమే పరాం । జీవ భూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ । అహం కృత్స్నస్యజగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనం జయ ॥ ) అని చెప్పియున్న ప్రకారమా బ్రహ్మము స్థూలసూక్ష్మశరీరముగా నేర్పడెడి యష్ట విధమయిన యపర ప్రకృతిగాను, కారణ శరీరమయిన యజ్ఞానముచేత నవచ్ఛిన్నమయి జీవభూతమయిన పరప్రకృతిగాను కావలసినప్పుడు శుద్ధ సత్వమయ దివ్య మంగళ శరీరమును ధరించి స్వాధీన మాయుకుడై సర్వజ్ఞుడై పైని యుదహరించిన రెండు ప్రకృతులయిన చిద చిత్తుల కీశ్వరుడుగా నేర్పడు చున్నాడు. ఇందు వల్లనే కార్య బ్రహ్మము సర్వశబ్ద వాచ్యమగు చున్నది, యిట్లిచ్ఛయించి, చిదచిదీశ్వర స్వరూప ముగ పరిణమించుట బ్రహ్మము యొక్క స్వభావము గనుకనే. దీనికి ప్రకృతియనిపేరు గలిగినది.

## జీవుడు అంతఃకరణ ప్రతిబింబము కాదనుట.

అయితే కొన్ని మతములవారు కారణ శరీరావచ్ఛిన్నములైన బ్రహ్మలేశములు జీవులుగారనియు, నచిద్రూప మయిన యంతఃకరణ మందు ప్రతిఫలించిన బ్రహ్మప్రతిబింబములే జీవులనియు, నచిత్తు బ్రహ్మస్వరూపము గాదనియు నచిత్తురజ్జువందు భ్రాంతికల్పితమయిన సర్పము వలె మిథ్యాభూత మనియు జెప్పుచున్నారు. ఈ పక్షములో ననేకాక్షేపము లుండి నను వాటిలో ముఖ్యము లయినవి కొన్నిటిని జూపు

చున్నాడనవి చెప్పియనిన, నగుపడని యీశ్వరుడు మిథ్యాభూత మయిన యంతఃకరణమునందెట్లు ప్రతిబింబించు, (నంతియే గాక. మోక్ష ము ప్రతిబింబుడైన జీవునకే కదా, జ్ఞానముచేత నబద్ధమయిన యంతః కరణమును పోగొట్టుకొనిన పిమ్మట, స్వల్పసుఖ భోక్తయగు జీవరూప ప్రతిబింబము లేకపోవునేగాని.) గీతాశాస్త్రములో నష్టాదశాధ్యాయ మందు॥ (శ్లో॥ అహంకారం బలందర్పం కామంక్రోధంపరిగ్రహం। విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥) అనిచెప్పి యున్న ప్రకారం మీప్రతిబింబుడు సత్యజ్ఞానానంద మయిన బ్రహ్మం బెట్లగు గనుక, జీవుడజ్ఞానోపాధ్యవచ్ఛిన్నుడయి బ్రహ్మముతో లేశవ్యవ స్థను బొందినవాడని చెప్పవలయునది. యిందుకు ప్రమాణము, గీతా శాస్త్రములో పంచదశాధ్యాయమందు॥ (శ్లో॥ మమైవాంశో జీవ లోకే జీవభూత స్సనాతనః ॥) అనియున్నది, యిట్లైతే, ఘటావ చ్ఛిన్నాకాశం బుపాధిరూప ఘటనాశానంతరంబున మహాదాకాశ మయినట్లు, జీవుండును జ్ఞానముచేత నజ్ఞానోపాధి నాశానంతరంబున బ్రహ్మము గావచ్చును.

అయితే, తత్వ శాస్త్రములలో జీవులకు ప్రతిబింబ దృష్టాం తము జెప్పియున్నదే యని యంటేని, యీ దృష్టాంత ముపాధి చాల నమువలన ప్రతిబింబ మునకు గలిగెడి చలనాదులు బింబమునకు లేన ట్లుగ, నుపాధి గుణముల వలన జీవునకు గలిగెడి యజ్ఞానదుఃఖాదు లంశియగు బ్రహ్మమునకు లేవని జెప్పటకే గాని జీవులవచ్ఛిన్నులు గారని చెప్పటకుగాదు, ఎందు వలన నంటేని, ప్రతిబింబంబును జలా వచ్ఛిన్నమయినదియే గనుక, నిదియునవచ్ఛిన్న దృష్టాంతమే యగు చున్నది.

—✱ ప్రపంచము భ్రాంతికల్పితము కాదనుట. ✱—

మరియు సచ్చిద్రూప ప్రపంచము రజ్జు సర్పమువలె భ్రాంతికల్పిత మనిచెప్పెడి పక్షములో, రజ్జువును,భ్రమించువాడును, వీనికి పూర్వానుభూతమయిన సర్పము, నీమూడునుండినగాని, రజ్జుసర్పభ్రాంతియెట్లు గలుగదో, యట్లుభ్రమాధిష్ఠానంబును, భ్రమించు వాడును, పూర్వానుభూత ప్రపంచంబునులేక, ప్రపంచభ్రాంతి గలుగ నేరదు. కారణావస్థయందు బ్రహ్మముకంటె వేరుగా నేవస్తువు యును లేదాయెను, బ్రహ్మము జ్ఞానస్వరూపమాయెను, పూర్వానుభూత మగుటకు ప్రపంచమే లేదాయెను, గనుకనీదృష్టాంతమున కవకాశములేదు.

అయితే, బ్రహ్మమందు బ్రహ్మమునకే భ్రాంతిగలుగుచున్నదని చెప్పెద మంటేని, యా బ్రహ్మము నిరవయవంబు, నతీంద్రియంబును, జ్ఞానస్వరూపంబు నగుటవలన నదియును సమీచీనంబుగాదు, గనుక నిన్నివిరోధంబులుండునప్పు, డచిత్తు మిథ్యయని చెప్పుటకన్నను, సదసచ్చాహ మేజార్జునయను గీతావచన ప్రకారము బ్రహ్మమే తనయిచ్ఛచేత సచ్చిద్రూపముగా నును తానే యగుచున్నాడని చెప్పుటవలన, నేవిరోధము లేకనే బ్రహ్మమున కద్వైతముసిద్ధించుచున్నయది.

అయితే, జగంబు రజ్జుసర్పమువంటిదనియు, మరుమరీచికవంటిదనియు, నివిమొదలయిన దృష్టాంతములచేత శాస్త్రములలోనసత్యమని చెప్పబడియున్నదేయని యంటేని, యేశాస్త్రము జగంబునకు రజ్జ్వాది దృష్టాంతములను జెప్పుచున్నదో, యాశాస్త్రము జగంబు మృద్వికారములయిన ఘటశరావాదులవలెనే, సువర్ణ వికారములయిన కటక కుండలాదులవలెనే, బ్రహ్మపరిణామమనియును దృష్టాంతములను జెప్పుచున్నది; గావున నింద్రియ గోచరంబులయిన విషయంబు లుండునందాక నర్థ క్రియాకారులగుచునుండుటవలనను, అర్థ క్రియాకారులు

గాని రజ్జుసర్పాదులకన్నను విలక్షణముగా ప్రబల ప్రత్యక్ష విషయము లగుట వలనను, శాస్త్రంబునకు మిథ్యయనిభావంబుగాదు.

అయితే, ప్రపంచ మునకు మిథ్యాత్వ సూచకము లయిన రజ్జు సర్పాది దృష్టాంతములనుజెప్పెడి వాక్యములకును, సత్యత్వసూచకము లయిన మృద్ఘటాది దృష్టాంతములనుజెప్పెడి వాక్యములకును, సామరస్యముజేసి యొకసాధారణ ధర్మమందు వేదములకు తాత్పర్యముజెప్ప వలయును, గాని యొకటి ప్రమాణ మనియు, నొకటియప్రమాణమని యును, జెప్పగూడదుగదా, యట్టిసాధారణధర్మమెద్దియనియంటేని విషయములు బ్రహ్మమువలెనే త్రికాలములయందునిత్యములుగానుండక పోవుటవలనను, రజ్జువందుగలిగిన సర్పభ్రమము జ్ఞానముచేత నివర్తించినవెనుక రజ్జువెట్లు శేషించుచున్నదో, సువర్ణమందు గలిగిన కటక కుండలాది రూపములు నశించినవెనుక సువర్ణమెట్లుశేషించుచున్నదో యారీతిననే బ్రహ్మమందుగలిగిన నామరూపాత్మక ప్రపంచమునశించిన వెనుక బ్రహ్మమే శేషించుచున్నది, గనుకనున్నూ, యీదృష్టాంతముల కన్నిటికిని దార్ష్టాంతికమయినప్రపంచమునకును ననిత్యత్వమేసాధారణధర్మమైయున్నది, గావున నీయంశమునందేశాస్త్రములకు తాత్పర్యమని నిర్ణయించదగియున్నది, యటులగాక మిథ్యాత్వమే సాధారణధర్మమనుటయందు రజ్జ్వాదిదృష్టాంతములకుతాత్పర్యమని చెప్పెదమంటె, మృత్సువర్ణాది దృష్టాంతములలోనది వ్యభిచరించును. ఇది యునుంగాక, ప్రపంచము మిథ్యకాదనుటకుజీవులునీదేహముతోజేయుచున్న కర్మములు జన్మాంతర ములకు హేతువులగుచు నుండుటయే ప్రబలసాక్ష్యముగనున్నది.

అయితే, ప్రపంచము మిథ్యయని చెప్పుటకు భావమేమన్నను, ప్రపంచవిషయములు క్షణభంగురములనిజ్ఞానముగలిగి, విషయాసక్తుడు గాకయుండుటేభావము. అట్లుగాక యింద్రియగోచరమయిన ప్రపంచ

మంతయు మిథ్యయై, తద్విషయకజ్ఞానమంతయు భ్రమమయిన యెడల సత్యమయిన పదార్థమే లేనందున, ప్రమారూపజ్ఞానంబే సిద్ధింపదు గనుకభ్రమ మనుటకు హేతువులేదు.

అయితే, యేజ్ఞానమునకు బాధకము గలుగుచున్నదో యట్టి జ్ఞానముభ్రమమనియు, బ్రహ్మవిషయజ్ఞానమునకు బాధకము గలుగదు గనుక, యాజ్ఞానము ప్రమయనియుఁజెప్పెదమంటేని, యింద్రియగోచరముగానిదియు, నాస్తికవాదమువలన బాధితమగునదియునైన బ్రహ్మవిషయకజ్ఞానంబునకును ప్రమాత్వము సిద్ధింపదు గావున లోక వ్యవహారము వలననే, భ్రమప్రమాదివ్యవస్థల నంగీకరింప వలయునుగనుక, నర్థక్రియా కారి యయ్యెడు ప్రపంచ పదార్థ ములకు మిథ్యాత్వ మున్ను, తద్విషయక జ్ఞానమునకు భ్రమత్వమున్ను, సిద్ధింపనేరదు.

అయితే, సిద్ధాంత మే మనగ, సదసచ్చాహ మర్జున యనెడు గీతావచనప్రకారము సదసత్తులు రెండును బ్రహ్మస్వరూపంబే గావున ప్రపంచము బ్రహ్మమునకంటె వేరనిచెప్పగూడదు.

అయితే, గీతాశాస్త్రము ద్వితీయాధ్యాయమందు. (శ్లో॥ నాసతోవిద్యతేభావో నాభావోవిద్యతేసతః । ఉభయోరపిదృష్టోంత స్త్వనయోస్తత్వ దర్శిభిః॥) అనెడిశ్లోకములోనసత్తుకు భావము లేదని చెప్పి యున్నది, గనుక జాగ్రదవస్థలో ననుభవమునకు వచ్చుచుండెడు నసద్రూపమయిన నామ రూపాత్మక ప్రపంచము స్వప్నమువలె నబద్ధ మనికొందరుచెప్పుచున్నారు, అచ్చోటనట్టియర్థముగాదు. ఎందువలన నంటేని, యాశ్లోకమునకు నీవలి శ్లోకములయం దసద్రూపము లయిన దేహాదు లంతవంతము లయినవి గనుక నిత్యములుగావనియు, శరీరి నిత్యుడుగనుక, యాయనకు నాశము లేదనియు స్ఫుటముగాఁ బ్రతిపాదించియుండుటవలన, నాసతః యను శ్లోకం బీయంశంబునే సంక్షేపముగాఁజెప్పవచ్చినదిగాని, జాగ్రదవస్థయందువర్తమానకాలములో

నర్థక్రియాకారి యగుచు నుండెడు శరీరములు స్వప్నపదార్థముల వలెనబద్ధములని చెప్ప వచ్చినదిగాదు.

అయితే, స్వప్నమందును స్థలనాద్యర్థ క్రియలు గలుగ లేదా యనియంటేని, యదిసరిగాదెందువలననంటేని, స్వప్నమందుజ్ఞానమే యర్థక్రియాకారి యగుచున్నది గాని విషయము లర్థక్రియాకారులు గాలేదు.

అయితే, జాగ్రదవస్థయందుఁ బరిదృశ్యమాన విషయములర్థ క్రియా కారులయి నట్లు స్వప్నావస్థ యందు స్వాప్న విషయము లర్థ క్రియాకారులు గాలేదాయనియంటేని, యొకస్వప్నములో ననుభూత విషయములు వెంబడి జాగ్రదవస్థాద్యనంతర స్వప్నములలోననుభవము నకువచ్చుటలేదు గనుక మొదలి స్వప్నము యొక్క యవసానము లోనే యావిషయములు బాధితము లగు చున్నవి, ఒక జాగ్రదవస్థ యందను భూతపదార్థములు నడుమ ననేక స్వప్నాద్యవస్థలచేత వ్యవధానము గలిగినను, అనంతర జాగ్ర దవస్థలయందన్నియు నేకరూపములుగా నే యనుభవింపఁ బడుచున్నవి గనుక, వాటికి స్వప్నాద్యవస్థలచేత బాధ యంగీకరింపఁదగియుండ లేదు, గావున స్వప్నము వంటిదే జాగ్రదవస్థ యనిచెప్పుట సరిగాదు, గనుక నీయభిప్రాయము చేతనే వ్యాససూత్ర ములలో ద్వితీయాధ్యాయమందు ద్వితీయ పాదములో ౨౮ - ౨౯వ సూత్రములు, (నాభావ ఉపలబ్ధేః । వైధర్మ్యాచ్చనస్వప్నాదివత్) అనిచెప్పబడి యున్నది, మరియు నద్వైతి ప్రధానులయిన గౌడపదా చార్యులవారు మాండూక్యోపనిష ద్వివరణముగారచించిన కారికలలో సృష్టిప్రకరణమందలిపరపక్షోపన్యాసములో. (స్వప్నమాయాస్వరూ పేతి సృష్టిరన్యైర్వికల్పితా) యనిచెప్పి, (దేవస్యైష స్వభావోయ మాప్తకామస్యకాస్పృహా।) యనిసిద్ధాంతముజేసియున్నారు, గావున నసత్తుకు భావములేదనెడు గీతావచనమున కసద్రూపములయిన నామ

రూపములనిత్యములని తాత్పర్యమే కాని స్వప్నమువలె నసత్యములని గాదు. ఇందుకుగీతాశాస్త్రమందు షోడశాధ్యాయములో. (శ్లోకము॥ అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం । అపరస్పరసంభూతంకిమన్యత్కామహైతుకం । ఏతాందృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః। ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయజగతోహితాః॥) అనియున్నందున జగంబసత్యమనిచెప్పెడివారలాసురీ సంపదగలవారనిచెప్పియున్నది.

అయితే, జగంబుసత్యమనిచెప్పెడి కొందరు భ్రమజ్ఞానమునకు విషయమయిన పదార్థములను, తద్విషయకభ్రమజ్ఞానంబునీరెండును జగంబులోఁ జేరినవనియెంచి యవియును ప్రమయేయని యత్యుత్పథ యుక్తులు చెప్పుచున్నారు. ఎట్లంటేని, రజ్జుసర్పభ్రాంతిస్థలమునందును, రజ్జుసర్పములు పంచభూతస్వరూపంబులేగనుక నాకాలమందుఁగొన్ని హేతువులచేత రజ్జువందు సర్పబోధకమయిన యవయవములు తోచి నట్లదున సర్పమని తలంచుఁగావున నీజ్ఞానము ప్రమయేగాని భ్రమముగాదని చెప్పుచున్నారు, అట్లీజ్ఞానము ప్రమయయ్యెడి పక్షమందీజ్ఞానమునకు విషయమయిన రజ్జువందుఁగలిగిన సర్పమర్థక్రియాకారిగావలసివచ్చు,నింతియేగాక, భార్యాశరీరమందును మాతృశరీరమందునుండునవి పంచభూతావయవములేగనుక, పైనిజెప్పిన హేతువుల ప్రకారము, తల్లిని భార్యనుగాభ్రమించి క్రీడించెనేని దోషములేక పోవలసివచ్చును, గనుక నటుల నెంతమాత్రముఁ జెప్పగూడదు, గావున నచిత్తుకుగలిగెడి నామరూపము లనిత్యములని చెప్పవలయుంగాని, యీయచిత్తు మిథ్యయనియును, బ్రహ్మముకంటె వేరనియుఁ జెప్పగూడదు.

అయితే, జగంబునందు భ్రాంతిచేతఁ దోచెడివిషయములుసత్యములుగావు గనుక, తద్విషయకజ్ఞానము ప్రమయనియుఁజెప్పగూడదు.

## ప్రపంచము సత్యముకాదనుట.

అయితే, జగంబు బ్రహ్మపరిణామమే గనుక బ్రహ్మమువలెనే

సత్యమనికొందరు చెప్పుచున్నారు, బ్రహ్మమందు కారణావస్థలో జగంబు లేకనే నడుమ గలిగి నివర్తించుచునది గనుక నీపరిణామరూప ప్రపంచము బ్రహ్మమువలె సత్యమని చెప్పఁగూడదు, పైనచెప్పిన హేతువులవలన మిథ్యయనియును జెప్పఁగూడదు.

అయితే, యీ యర్థక్రియాకారియైన ప్రపంచముగలిగినది మొదలుకొని నశించువరకు వాస్తవమనియుఁ బూర్వోత్తర కాలముల యందు లేదనియుఁ జెప్పవలయును, ఇందుకుఁ బ్రమాణము, భగవద్గీతలలో ద్వితీయాధ్యాయమందు. (శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యానిభారత । అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరివేదనా॥) అనిచెప్పియున్నది.

అయితే, చిదచిత్తులు బ్రహ్మలేశములే యనిచెప్పిన పక్షములోఁ దద్గతము లయిన యజ్ఞాన వికారాదులు బ్రహ్మమున కంటవా, యని యంటేని, కారణావస్థయందు లేక కార్యావస్థయందుపాధులచేత బ్రహ్మముతో భేదవ్యవస్థను బొందిన చిదచిత్తులకుఁ గలిగెడు నజ్ఞాన వికారాదులు బ్రహ్మమునకంటవు, ఎట్లంటేని, యొకమనుజునకుతనదేహైకదేశమయిన పాదమందుఁ జచ్చువాయువనెడు నుపాధిసంభవించి నప్పుడయ్యుపాధిగల పాదము కాల్చినప్పటికిని, దునుకలుగగోసి చీర్చినప్పటికిని నెట్లువానికిఁ దెలియక నున్నదో యారీతినన్నే, చిదచిద్గతములయిన యజ్ఞాన వికారాదులు బ్రహ్మమునకంటవు, కాబట్టి కారణశరీరోపాధికులయి లేశవ్యవస్థను బొంది, యేజ్ఞానములేని జీవుల నపంచీకృత భూతములచేత బుద్ధీంద్రియ మనఃప్రాణాదిశక్తియుక్తముగస్థూల శరీరాంతర ప్రవేశాదులకు యోగ్యముగునట్లుగఁదనచేత సృజింపఁబడిన లింగశరీరములయందు బ్రవేశింపఁ జేయుచున్నాడు, ఇందుకు బ్రమాణము, శ్రీభాగవతములో దశమస్కంధమందు సప్తాశీతితమాధ్యాయములో. (శ్లో॥ బుద్ధీంద్రియమనః ప్రాణాన్ జనానామసృజత్ప్రభుః।

మాతా హ్యర్థంచభవార్థంచఆత్మనేకల్పనాయచ॥ ) అని చెప్పియున్నది గనుక నాలింగశరీరులకుఁ గించిజ్జ్ఞత్వాదులు గలుగఁజేసి, కర్మములను కర్మఫలముల నేర్పఱచి యీశత్స్వాతంత్ర్యము నిచ్చినందున జీవులు ప్రకృతిగుణములయిన తమోరజంబుల కార్యంబులయిన భ్రమాహంకారాశాదుల వలన భేదమును, గర్తృత్వమును, దమయందు వారోపించుకొని, స్వేచ్ఛాపూర్వకముగఁ జేసెడి ధర్మాధర్మోభయాత్మకములై, మానసిక కార్యములయిన పరస్పర దయేర్ష్యాది గుణదోషములచేత నార్జించిన పుణ్యపాపములను సర్వశక్తితోఁ బూర్ణుడై, సర్వాంతర్యామియై, సర్వసాక్షియై, సర్వజ్ఞుఁడయిన, యీశ్వరుండెఱింగి యాపుణ్యపాప తారతమ్యానుగుణంబుగ నింద్రియాదిశక్తులకు ద్వారభూతములై, పంచీకృత భూత స్వరూపములై, తన సర్వశక్తి ప్రకాశకరములయిన,దేవ నర మృగ పశు పక్షి వృక్షపాషాణాదిస్థూల శరీరములను జీవులకిచ్చుచున్నాడు. ఈ యంశములలో నుపాధులచేత బ్రహ్మముతో లేశవ్యవస్థను బొందిన జీవులకు స్థూల శరీరములు వచ్చిన క్రమము, యాజ్ఞవల్క్యస్మృతియందుఁ బ్రాయశ్చిత్తకాండలో జీవోత్పత్తిప్రకరణమందు. (శ్లో॥ నిస్సరంతియథాలోహపిండాత్తప్తాత్స్ఫులింగకాః । సకాశాదాత్మనస్తద్వదాత్మానఃప్రభవంతిహి । తత్రాత్మాహిస్వయంకించిత్కర్మకించిత్స్వభావతః । కరోతికించిదభ్యాసాద్ధర్మాధర్మోభయాత్మకమ్। నిమిత్తమక్షరఃకర్తాబోద్ధాబ్రహ్మగుణీవశీ । అజశ్శరీరగ్రహణాత్సజాత ఇతికీర్త్యతే॥ ) అని చెప్పియున్నది. ఈయర్థమునే విజ్ఞానయోగిసవిశేషంబుగవివులించియున్నాడు.

మరియు, నాత్మవలన లేవంబడిన తల్లేశంబులే యీసర్వమని బృహదారణ్యము చతుర్థాధ్యాయములో నూర్ణనాభియెట్లు తంతు రూపముగ లేచుచున్నదో, యగ్నివలన నెట్లు క్షుద్రములయిన విస్ఫులింగములు లేచుచున్నవో, యాప్రకారమీయాత్మ వలన సమస్తప్రాణులు,

సమస్తలోకములు, సమస్తదేవతలు సమస్తభూతములు లేచుచున్నవని చెప్పి యున్నది. ముండకోపనిషత్తులో నున్న దీని ననుసరించే చెప్పి యున్నది. గీతాశాస్త్రములోని త్రయోదశాధ్యాయమందుఁ గార్య కారణకర్తృత్వములకు హేతువు ప్రకృతియనియు జీవుడు ప్రకృత్యవచ్ఛిన్నుఁడై ప్రకృతి గుణములను దనవిగా భావించుటచేతఁ దజ్జన్యము లయిన సుఖదుఃఖముల ననుభవించు చున్నాఁడనియు, నీ జీవుడు సదసద్యోనులయందు జన్మించుటకు గుణసంగమే కారణమనియుఁ జెప్పఁబడి యున్నది. (శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే। పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే । పురుషః ప్రకృతిస్థోహిభుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్ । కారణంగుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు॥) అనియున్నది, గనుక, నీశాస్త్రముల వలనను లోకుల కనుభవమునకు వచ్చుచుండెడు సుషుప్తి స్వప్న జాగ్రదవస్థల వలనను, గారణ సూక్ష్మస్థూల శరీరములును, వాటిలో మాయాకార్యంబయిన తమంబును, స్వరూపాన్యథాజ్ఞానంబును, దెలియబడుచున్నవి. ఈ మూడవస్థలయందును జీవునకుఁ బ్రాజ్ఞతైజసవిశ్వులనియెడు నామములుగలిగి యున్నవి. పూర్వమేకర్తృత్వ బుద్ధిచేత మానసిక దోషముల వలన నీస్థూల శరీరములువచ్చెనో, తదనంతరము నట్టి కర్తృత్వ బుద్ధివలననే మనుష్యులు కాయికవాచికమానసికాదులచేతఁజేసిన పుణ్యాపాపకర్మజన్యప్రారబ్ధములనుబట్టి తత్తదనురూపములయిన జన్మములనిచ్చుచు,మరి కొన్నివిధములయిన ప్రారబ్ధంబుల బలాబలముల ననుసరించి జీవుల కనిచ్ఛాస్వేచ్ఛా పూర్వకముగ ఫలరూపము లయిన సుఖ దుఃఖముల ననుభవింపఁ జేయుచు మరికొన్ని విధములయిన ప్రారబ్ధములను బట్టి మనుష్యశరీరముచేతఁ బుణ్యారంభకపుణ్యా పాపారంభకపాప కర్మములను జేయించుచు, వైషమ్యాదులు లేక నీరీతిగాఁ గర్మాధీనము లయిననీచోచ్చజన్మపరంపరలను గ్రమంబుగ మాటిమాటికి జీవుల కీశ్వరుఁ డిచ్చుచున్నాడు.

అయితే నిన్నింటికిఁ గారణముకర్మ మేకదా మనుష్యుఁడు కర్మంబు సేయకనుండ రాదా యనియం టేని, దేహి యొకప్పుడును గర్మము జేయ కనుండ లేఁడనియుఁ గర్మము జేయకుండిన శరీర యాత్రయును సిద్ధింప దనియు, గీతా శాస్త్రములోని తృతీయాధ్యాయమందు. (శ్లో ॥నహి కశ్చిత్క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్ । కార్యతేహ్యవశః కర్మ సర్వ ప్రకృతిజైర్గుణైః॥ )అనియు, (నియతంకురుకర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః । శరీరయాత్రాపిచతేనప్రసిద్ధ్యేదకర్మణః॥ ) అనియును జెప్పి యున్నదిగనుక, నీమనుష్య శరీ రాధారమయిన యన్నభక్ష్యాదులనుగర్మంబు లేయుగుటవలనజీవుఁ డేకర్మమును జేయకయుండ లేడు.

అయితే అన్న పానాదులువర్జించి యీ దేహమును జాలించి మోక్షము నొందరాదేయని యంటేని, యటుల మోక్షము సిద్ధింపదు! ఎందువలననంటేని, యేదేవుఁడు తనలీలార్థ మీప్రపంచమును సృజిం చెనో, యేదేవుని మాయచేత నీ బంధము వచ్చి తరించుట కశక్యమై యున్నదో యాభగవంతుని ప్రీతికొఱకు నీ మనుష్యశరీరముచేత నేయా యనలీలాభి వృద్ధిఁజేయుచు, శాస్త్రశోధనా గురూపదేశాదుల వలన నాత్మానాత్మ వివేకమును గలుగఁజేసికొని ప్రకృతి కార్యములయందు గర్తృత్వా దులను వదలి యాయనను సర్వ ప్రకారంబుల నమ్మి యా భగవంతుని యనుగ్రహ ద్వారముగా సకల పాపములం బాపికొని మాయనుతరించి మోక్షముసంపాదింపవలయునది. ఇందుకుఁ బ్రమాణము, గీతాశాస్త్రముసప్తమాధ్యాయమందు. (శ్లో ॥ దైవీహ్యేషా గుణమయీ మమమాయాదురత్యయా । మామేవయే ప్రపద్యంతేమా యామేతాంతరంతితే । నమాందుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః । మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥) అనియు, అష్టాదశాధ్యాయమందు. ( శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి । భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని

మాయయా । తమేవశరణంగచ్ఛ సర్వభావేనభారత । తత్ప్రసాదాత్పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం ॥) అనియును జెప్పియున్నది, గనుకనట్లుసేయుకయింత సాహాయ్యకారియైనమనుష్యదేహమునుజాలించుటది యాసురస్వభావమయిన యాత్మహత్యయగునేగాని మోక్షహేతువు గానేరదు.

అయితే, జ్ఞానరహితులయిన పశుపక్షివృక్షపాషాణాదిశరీరులకు మోక్షము లేదుగదా! యనియంటేని, యివిప్రారబ్ధఫలానుభవజన్మంబులేగాని, జ్ఞానసంపాదకజన్మములుగావు. అందువలన,వృక్షాదిరూపప్రారబ్ధ నాశానంతర మాజీవులకు మనుష్యజన్మంబుల నీశ్వరుండిచ్చుచున్నాఁడు. అప్పుడయిన నాత్మానాత్మ వివేకముగలిగి యహంకారరూప కర్తృత్వమును వదలి భగవంతుని నమ్మినేని మోక్షమును గలుగఁజేయుచున్నాఁడు. అట్లుగాక, యీమనుష్యజన్మములోనేమఱలఁ గర్తృత్వ బుద్ధిచేతఁ గర్మములుచేసిన యెడల, వెండియు ననేకజన్మరూపాంధపరంపరలోఁ బడద్రోయు చున్నాడు.

అయితే, కొందఱు పశుపక్షివృక్షపాషాణాదులకుఁ బ్రాణము మాత్రముగలిగియుంటున్నది, గనుక ప్రాణగుణములయినతృష్ణ, యాశ మొదలగునవిగలిగి యుంటున్నవనియు, నాత్మ లేదనియు, నందువలన నాత్మగుణములయిన వివేకములు వాటికిలేవనియు, మనుష్యజన్మమునకు వివేకముగలదుగనుక యాత్మగలదనియును జెప్పుచు, నీపశుపక్షివృక్షాది జన్మప్రారబ్ధనాశానంతరంబున వాటికి మనుష్యజన్మమువచ్చుచున్నదని చెప్పుటయత్యంతవిరుద్ధమనిచెప్పుచున్నారు. అట్లు చెప్పగూడదు. ఎందువలననంటేని, పశుపక్షివృక్ష పాషాణాదులకును బూజ్యాపూజ్యతలు రోగారోగ్యములు, సుఖదుఃఖములు, దీర్ఘ స్వల్పా యుష్యంబులు, మనుష్యులకువలెనే పూర్వజన్మ కర్మఫలములు గలుగుచున్నవి.

అయితే, వివేకాదులులేని పశ్వాదులకును, జడప్రాయములైన వృక్ష పాషాణాదులకు, నానాజీవులకుఁ బూర్వజన్మకర్మాధీనముగ నీశ్వరుఁడు గలుగఁజేయు నింద్రియాది లోపములచేత జ్ఞాన తారతమ్యము గలుగు చున్నదియే గాని యాత్మయు సుఖదుఃఖములు వీరలకందఱకును సాధారణముగానున్నవి. ఇందుకుఁ బ్రమాణము, మనుస్మృతి ప్రథమాధ్యాయ మందు. (శ్లో ॥ తమసా బహురూపేణ వేష్టితాః కర్మహేతునా । అంతస్సంజ్ఞాభవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః॥) అనియును, గీతాశాస్త్రములోని త్రయోదశాధ్యాయమందు. (శ్లో ॥ యావత్సంజాయతేకించి త్సత్త్వం స్థావర జంగమం । క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ॥) అనియును జెప్పియున్నది. గనుక మనుష్యులకువలె స్థావరజంగమాదులకు నాత్మగలదు.

అయితే, యట్టిజ్ఞాన తారతమ్య, బలతారతమ్య, భాగ్యతారతమ్యములనుబట్టి, క్షుత్పిపాసాదులవలన నొకప్రాణి కొకప్రాణివిధేయముగ, నాహారముగ నుంటున్నది. ఇందుకుఁ బ్రమాణము, శ్రీభాగవతములోఁబ్రథమస్కంధము త్రయోదశాధ్యాయమందు. (శ్లో॥ అహస్తానిస హస్తానా మపదాని చతుష్పదాం । ఫల్గూని తత్రమహతాం జీవోజీవస్య జీవనం॥) అని చెప్పియున్నది గావున బ్రాణము గలవాటి కన్నిటికి నాత్మగలదు.

అయితే, మీదనొకచోట జీవుఁడహంకార ద్వారముగా బంధమును, జ్ఞానద్వారముగా మోక్షమును గలుగజేసి కొనుచున్నాఁడని చెప్పియున్నందున, జీవుడు స్వతంత్ర కర్తగాను మఱియు నొకచోట నీశ్వరుఁడు జీవునకుఁబ్రారబ్ధాధీనముగ జన్మములను, సుఖదుఃఖముల నిచ్చుచుఁ బుణ్యపాపారంభక కర్మములను జేయించు చున్నాఁడని చెప్పియున్నందున, జీవుఁడు పరతంత్రకర్తగాను గనుపట్టుచున్నాఁడు. ఈ

రెంటికిఁ బరస్పరవిరోధముకాదా, యనియంటేని, అట్లువిరోధములే దు. ఇందుకుదృష్టాంతము. త్రోవనుబోవుచుండెడి వానికిమణి దొరుకుట యును, బిడుగునెత్తినబడుటయు నిట్టియంశములయందీ జన్మములోఁబు రుషునియిచ్ఛా ప్రయత్నము లేమియు లేక నే, వారలపూర్వజన్మప్రబల కర్మ జన్యమయిన ప్రారబ్ధ ఫలమ్మునీశ్వరుఁడనుభవింపఁ జేయు చున్నాఁడు గనుక నిదిజీవున కనిచ్ఛాపూర్వకముగ ననుభవింపఁజేసెడి ప్రారబ్ధఫలము. ఈయంశములయందు జీవుఁడు పరతంత్ర కర్తయాగు చున్నాఁడు. ఒకఁడు వివాహామునకై ద్రవ్య సంపాద నార్థముగఁ బోయి నష్టుఁడొక గృహస్థుడు వీనికాహూయ కన్యాదానముసేయు చున్నాఁడు. ఈవిషయమందుఁబురుషుని యాపదిచ్ఛాప్రయత్నములను బట్టి యీశ్వరుఁడు ఫలమునిచ్చుటగనుక నిదిజీవుని స్వేచ్ఛాపూర్వకముగా ననుభవింపఁ జేసెడి ప్రారబ్ధఫలము, ఆపురుషుండే ద్రవ్యముసంపా దించి కన్యనిచ్చు నట్లొప్పించుకొని క్రమముగాఁ బెండ్లియాడుట వీని పూర్ణ ప్రయత్నమువలన నీశ్వరుఁడు గలుగఁజేసెడి ఫలంబు. అటుల పూర్ణ ప్రయత్నముఁజేసిన నీశ్వరుఁడుఘటింపఁజేయక పోవుటదిజీవుని ప్రారబ్ధ ప్రతి బంధకము, అప్పుడిష్ట ప్రాప్త్యభావ ప్రయుక్తమయిన దుఃఖమును గించితాకాలము వీఁడనుభవించుటవలన నివర్తింపఁ దగిన ప్రారబ్ధమయినపక్షమందు గాలాంతర ప్రయత్నమువలన నీశ్వరుఁడిష్ట సిద్ధిని జేయుచున్నాఁడు, గనుక నెగువఁజెప్పిన నిమిత్తములనుబట్టి ఫల ములనిచ్చుట కీశ్వరుండే కర్తయని చెప్పినందుకును బ్రయత్నాంశముల యందు జీవుఁడుకర్తయని చెప్పినందుకును బ్రమాణము. గీతాశాస్త్ర ములోని యష్టాదశాధ్యాయమందు, (శ్లో ॥ అధిష్ఠానంతథాకర్తా కరణంచపృథగ్విధం । వివిధాచపృథక్చేష్టా దైవంచైవాత్ర పంచమం। అనియున్నది గనుక ప్రయత్నాంశమందు జీవుండే కర్తయైనందున విధినిషేధశాస్త్రములకిచోట నుపయోగము గలిగియున్నది.

అయితే, నీవైదు కారణములలోఁ గర్తయనునది, యహంకారమనియు, దైవమనునది, యదృష్టమనియుఁ గొందఱు చెప్పుచున్నారు అదియుక్తము గాదేలనంటేని, యహంకారము జడముగనుక జీవుఁడహంకారము నాశ్రయించి కర్తృత్వబుద్ధితోఁ జేసినకర్మఫలములయిన సుఖదుఃఖములకుభోక్తదానేయగుచున్నాఁడు. ఇటువలెనే, దైవమనెడు పదమునకదృష్టంబనునది యొక యర్థమయిన నాయదృష్టము జడము గనుక నదృష్టాధీనముగ దేవుండేఫలము నిచ్చుచున్నాఁడు. ఇందువలననే యీశ్వరునకు వైషమ్యాదులు లేక పోవుచున్నవి, కాఁబట్టి కేవలమహంకారాదృష్టంబులే యైదుకారణములలోఁ జేరవు. ఈప్రకారము వారివారి ప్రారబ్ధరూప తత్తత్కర్మాధీనములయిన దేవ నర మృగ పశుపక్షి వృక్ష పాషాణాది జన్మాంతరములను, సుఖదుఃఖములను ఈశ్వరుడు జీవులకు మాటిమాటికి నిచ్చుచు వైషమ్యాదులు లేక ప్రపంచలీల లనుభవించుచున్నాఁడు.

## జన్మాంతరముకలదనుట.

అయితే, కొందఱు భగవంతుఁడు జీవులకు జన్మాంతరకర్మజన్యప్రారబ్ధాధీనముగాఁగాక, తనస్వాతంత్ర్యముచేతనేసుఖదుఃఖాదుల నిచ్చుచున్నాడని చెప్పిన యెడల భగవంతునకు వైషమ్యాదులు వచ్చుచున్నవనెడి హేతువువలననే, జీవులకు జన్మాంతరములంగీకరింపవలయుననిమీరును జెప్పుచున్నారుగదా? యొకడుతనసొగసు కొఱకుదన వెంట్రుకలను గొన్నింటినిఉంచి, కొన్నింటిని దీసివేయుటవలననావెంట్రుకలవిషయమై యతనికి వైషమ్యాదు లెట్లు చెప్పదగియుండవో యారీతిననే భగవంతుడునుస్వశక్తిప్రకాశార్థముగఁదనస్వరూపములయిన జీవులలోఁగొందఱకు సుఖాదులను, గొందఱకుదుఃఖాదుల నిచ్చుటవలన భగవంతునకు వైషమ్యాదులు చెప్పఁదగి యుండవు గనుక, జీవులకు జన్మాంతరము లంగీకరించుట యావశ్యకముగాదని చెప్పుచున్నారు.

అట్లయితే, జీవులకు రాఁబోవు స్వర్గనరకాదులను గూడా ఈశ్వరుడు స్వతంత్రముగానే యీయవచ్చును గనుక ఈశ్వరోక్త ధర్మాచరణమే పనిలేదు. మఱియును జీవులు తనస్వరూపములయినను వారలకుఁదనతోనును, వారిలో వారలకును భేదబుద్ధిగల్పించి వారలకు భోగార్థముగ భగవంతుఁడు తనస్వశక్తి ప్రకాశకరమయిన విచిత్ర ప్రపంచమును నిర్మాణముజేసి, జీవులకు సుఖదుఃఖాదులనిచ్చుచున్నాడనివారును జెప్పుచున్నారు. అట్టి భేదబుద్ధిగల జీవులకు భగవంతుడు తన స్వాతంత్ర్యముచేతనే సుఖదుఃఖాదుల నిచ్చిన యెడల భగవంతుని యందు వైషమ్యాదులను జీవులారోపించుటకుఁ గారణ మగుచున్నది. కావున జీవులకు జన్మాంతరప్రారబ్ధాధీనముగానే సుఖదుఃఖాదులనిచ్చుచున్నాడని యవశ్య మంగీకరింప వలయునది. అట్టి ప్రారబ్ధానుసారులయినఫలంబులనుప్రత్యక్షహేతువులేకనే యిచ్చినయెడల జన్మాంతర ప్రారబ్ధము నూహింప లేనివారు, తనయందు వైషమ్యాదుల నారోపింపఁబోవుదురనెడు నభిప్రాయము వలననే, భగవంతుఁ డట్టిఫలములను జీవులకిచ్చునప్పుడు, లౌకికమందు నానావిధ ప్రత్యక్షహేతువులను గల్పించియే, యిచ్చుచున్నాఁడు.

అయితే, భగవంతుఁడు తనకు నిందరాకుండనుండుటకై యిట్టి ప్రత్యక్షహేతువులనుగల్పించి జీవులకు సుఖదుఃఖాదులను దనస్వాతంత్ర్యముచేతనే యిచ్చుచున్నాఁడనిచెప్పరాదా ! యనియంటేని, తనతో భేదభావనఁజేసెడి జీవులకన్యాయముగ దుఃఖాదులను దనస్వాతంత్ర్యముగానేయిచ్చునట్టి భగవంతుండట్టి నిందకుభయపడి హేతువులనేల గల్పింపవలెను.

అయితే, యిట్లుహేతుకల్పన సేయుటది సుఖ దుఃఖానుభవ కాలములయందయినను జీవులకుఁ దనయందు మతిగలిగి కృతార్థులు

గాబోయెదరని యొప్పక మోసము చేయుటకుఁగా నేర్పడుచున్నది; గావున మీఁదఁజెప్పిన హేతువులను జక్కఁగ యోచించగా జీవులకు జన్మాంతరములవశ్యము గానిశ్చయింపఁదగియున్నవి.

అయితే, అచేతనములయిన క్షేత్రాదులయందు నేక దేశములలో గలిగెడి పూజ్యా పూజ్యతలున్నతద్భోక్తలయిన జీవుల యొక్క యదృష్టాధీనములనియే, చెప్పవలయును.

అయితే, జీవులకు జన్మాంతరము లేదనుటకును, ఈశ్వరునకు వైషమ్యాదులు గలుగకుండుటకును గొందరు మహమ్మదియ్యానులు చెప్పెడి, యుక్తులెవ్వియనిన, మొదల నీశ్వరుడు జీవులను సృజించి, రోగరాజ్యాదులను గల్పించి, వీటిలో మీయిష్టమయిన దానిని గోరుడని జీవులతోఁ జెప్పినందున, గొందరు రాజ్యాదులను గోరినారనియు, నీ యల్పకాలీయము లయిన లౌకికానందము మదమును గలగజేసి దుష్టకార్యములను జేయించి నిత్యనరకములను గలుగజేయుచున్నది, గనుక నిట్టిమదకారణములు గానివియు, దైన్యద్వారముగ భగవంతునిస్మరింపజేయునవియు, నైనరోగదారిద్ర్యాదులను గొందరు గోరినారనియు, నట్లు వారు వారు గోరుకొన్నదియే, కిస్మత్ అనియు, నాప్రకారము వారు వారనుభవించు చున్నారనియును జెప్పుచున్నారు. ఆలాగైన నరోగులై రాజ్యాదుల ననుభవించెడి గొందరు విద్యా వివేకములు గలిగి జ్ఞానవంతులై యున్నారు. రోగదారిద్ర్యముల ననుభవించెడి గొందరువిద్యా వివేకములేక చౌర్యాదిదోషములను జేయుచున్నారు. గనుక నెగువజెప్పిన హేతువులుసరియైనవిగావు, కావున పూర్వజన్మకర్మజన్యాదృష్టమే కిస్మత్ యని చెప్పవలయునది, మరియు జన్మాంతరమే లేదనిచెప్పెడిహూణులుమనుష్యులనుభవించెడి రోగరాజ్యాదులిప్పటిజన్మమందు జేసినపుణ్యపాపకర్మఫలంబు లేయనిచెప్పుచున్నారు. ఎట్లం

టేని, శిశువుపుట్టినప్పుడు, శిశువునకుగలిగెడి దోషాదులు జన్మదోషా దులనియు,నవి తల్లిదండ్రులపాపఫలములనియు,నీవల, వారువారుచేసిన పాపములవలన వారివారికిగలిగెడి రోగమరణాదులు కర్మదోషాదు లనియు జెప్పుచున్నారు. అలాగైనను మహా ధార్మికులయిన తల్లి దండ్రులకు,గుడ్డి, కుంటు మొదలయిన దోషములుగలిగిన శిశువులు పుట్టుటయు, జక్కగబుట్టితక్షణమేచచ్చుటయుగలిగియున్నది. ఇంతియేగాక, దుష్టకార్యములుచేసెడు తల్లిదండ్రులకు, దృఢగాత్రులునదృష్టవంతులు, పుణ్యవంతులునగుశిశువులుగలుగుచున్నారు. మఱియుశిశువుపుట్టినవెనుక బుద్ధిదెలిసిపుణ్యపాపములుసేయకమున్నె, యాశిశువునకుగలిగెడి దోషాదులెవ్వరి దుష్కృతము వలన గలిగెడివి, కాసిమ్ము, బుద్ధిదెలిసిన వెనుక జ్ఞానవంతుడై ధర్మకార్యములను సేయువాడు, రోగిగనుదరిద్రుడుగ నల్పాయువు గలవాడుగ, నగుచున్నాడు, దుర్మార్గుడయిన వాడు భాగ్యవంతుడుగ, దీర్ఘాయుష్మంతుడుగ, దృఢగాత్రుడుగ, నుంటున్నాడు, గనుక నిట్టిప్రత్యక్షానుభవమువలన, మీదవారుచెప్పినయుక్తులు సరిపడవు. గనుక, రోగరాజ్యాదులు పూర్వజన్మ కర్మజన్యాదృష్టఫలములనివీరును జెప్పవలయునది.

అయితే, జీవులయొక్క పూర్వజన్మ కర్మాధీనముగ నీజన్మమందు దత్తత్కాలానుగుణంబుగ సుఖదుఃఖాదుల నీశ్వరుఁడిచ్చుచున్నాడని చెప్పనేల, యీభూతప్రసవకాలములయందుండెడు నవగ్రహస్థితులనుబట్టి వాటివాటి చారముల ప్రకార మెగువ జెప్పిన సుఖదుఃఖరూపఫలములు కాలానుగుణముగ నీశ్వరనిర్ణయప్రకారముగ జీవులకు గలుగుచున్నవని చెప్పరాదాయని, జన్మాంతరము గలదనుట కొప్పని కొందఱుమతస్థులు చెప్పుచున్నారు. అట్లుజెప్పగూడదేలనంటేని! ఒక సమయములో బుట్టిన, నర మృగ పశు పక్షి వృక్ష పాషాణాదులకునవగ్రహముల చారముల ననుసరించి, జ్ఞానబల లాభా యుష్యాదులేకరీతిని

గలుగవలసియుండగ, నట్లులేకతత్తజ్జాతినిష్ఠప్రకారమే, తారతమ్యముగ పయినజెప్పినవి గలుగుటవలనను, మనుష్యులలోనే, యొకసమయములో బుట్టిన యిద్దరిలోనొకడు రాజుగ, నొకడు దరిద్రుడుగనగుచున్నారు.

అయితే, యుత్పత్తికాలము సూక్ష్మమగుటవలన బొరబాటు వచ్చియుండునని చెప్పవురు. అదియట్లుండనిమ్ము, తమతమ జాతకప్రకారముగ, దశలయందనుభవముగ జరుగుచునుండెడి ఫలములు గల జాతకులకు, రాజయోగములువచ్చినప్పుడు రాజపుత్రునకుగలిగెడుఫలము దరిద్రునకు గలుగునా! యట్లుగలుగదు. ఇందుకు, బృహజ్జాతకగ్రంథములోపదునొకొండవదగు రాజయోగాధ్యాయమందు౧౨వ శ్లోకము॥ (అపిఖలకులజాతా మానవా రాజ్యభాజః కిముతనృపకులోద్ధా ప్రోక్తభూపాలయోగైః। నృపతికులసముద్ధాపార్థివావక్ష్యమాణైఃభవతినృపతితుల్యస్తేష్వభూపాలపుత్రః॥) అనియున్నదిగనుక, కొన్నియోగాదులలో రాజపుత్రునకే రాజ్యాధికారము గలుగుచున్నది గాని, నీచులకు రాజ్యాధికారమురాదనిచెప్పియున్నది. ఇందువలన బూర్వజన్మ సుకృతముచేత గలిగెడు రాజపుత్రత్వమును గొన్నియోగము లపేక్షించు చున్నయవి. మరియుఁబూర్వజన్మ కర్మానుగుణంబుగ జరిగెడిశుభాశుభఫలానుభవకాలములనుముందుగ దెలుపుటకే గ్రహచారములుసూచకములై యుండునట్లు భగవన్నిర్ణీతములైయున్నవి. ఇందుకా బృహజ్జాతకగ్రంథకారుండే ప్రథమాధ్యాయమందు. (శ్లో॥ హోరేత్యహోరాత్రవికల్పమేకేవాంఛంతి పూర్వాపరవర్ణలోపాత్ । కర్మార్జితం పూర్వభవేసదాదియత్తస్యపక్తింసమభివ్యనక్తి॥ ) అనిచెప్పియున్నాడుగావుననిప్పటి సుఖదుఃఖములు పూర్వ జన్మ కర్మ ఫలములనియే చెప్పవలయును.

అయితే, కృష్ణాష్టోత్తర శతములో. (శ్లో॥ సర్వతీర్థాత్మకస్సర్వగ్రహరూపీపరాత్పరః॥) అనియున్నందున భగవంతుడు సర్వగ్రహస్వరూపుడని చెప్పబడియున్నదిగనుక, నవగ్రహ స్వరూపముగ నాభగవంతుడే చారముల ప్రకారముగ జీవులకుఫలము నిచ్చుచున్నాడని చెప్పరాదాయనియంటేని, యట్లునవగ్రహ స్వరూపముగానయినను జీవుల ప్రారబ్ధాపేక్షలేక భగవంతుండే సుఖదుఃఖములనిచ్చుచున్నాడని చెప్పినపక్షమందు వైషమ్యమువచ్చును గనుక ప్రారబ్ధము నపేక్షించియే ఫలముల నిచ్చుచున్నాడని చెప్పవలయు నది, యింతియేగాక, జన్మాంతరంబే లేదని చెప్పెడు పఠాణులు, మహంమదియ్యానులు మొదలైన వారలును మనుష్యుడుమృతి బొందినవెనుక, విచారణకాలములో వానివాని కర్మములను బట్టిస్వర్గ నరకాదుల ననుభవింప జేయుటకు దగిన శరీరములను భగవంతుం డిచ్చుచున్నాడని చెప్పుచునుండగ జీవునకు, దేహాంతరమువచ్చుటయే జన్మాంతరము గనుక, మనుజుని కర్మానుగుణముగ వాడు సుఖదుఃఖముల ననుభవించుటకు మనుష్యాది శరీరములనుభగవంతుడు మఱల నిచ్చుచున్నాడని యేలజెప్ప గూడదు, గనుక, జీవునకు జన్మాంతరముగల దనియొప్పకొనవలయునది, అట్లుగాక, యీశ్వరుడు దానేజీవులకు రోగరాజ్యాదులను గలుగజేయుచున్నాడేగాని, జీవుల పూర్వజన్మ కర్మములను బట్టి రోగరాజ్యాదుల నిచ్చుటగాదని చెప్పెడి పక్షములో, జీవులయందు తప్పునొప్పులేనిదే యీశ్వరుడు వైషమ్య బుద్ధి చేతరోగరాజ్యాదులనిచ్చుటగనుకమనుష్యునకైనను ద్వేషాదులు గలుగుటకెదిరి వానిదోషమించుకయైన నుండెనేని గలుగుచున్నదిగాని నిర్హేతుకముగనెవ్వరికిని ద్వేషాదులు గలుగనప్పు, డీశ్వరునకీలాగు గలుగుటవలన మనుష్యుని కన్నను దక్కువయైన వాడు గనేర్పడుచున్నాడు, గనుకనటువంటి దుష్టుడైన దేవుని నమ్మితే ప్రయోజన మేమియున్నది, కాబట్టి జన్మాంతర కర్మఫలములైన రోగరాజ్యాదుల నీశ్వరుడిచ్చు చున్నాడని చెప్ప వలయునది.

అయితే, యప్రత్యక్షమైన జన్మాంతర సద్భావమందు ప్రమాణ మేమన్నను జీవులయొక్క రోగారోగ్యములును, దారిద్ర్యభాగ్యములును, ప్రయత్నముచేతఁ నసిద్ధియు, నప్రయత్నముచేతసిద్ధియు, జ్ఞాన తారతమ్యములుగలిగిన, నర మృగ పశు పక్షి వృక్ష పాషాణాది జన్మములును, శిశువు పుట్టినప్పుడే స్తన్యమును గ్రహించుటయు నివి మొదలయినవి, పూర్వజన్మకర్మ జన్యాదృష్ట ఫలములు. ఈదృష్టాంతముల వలనను, మనుష్యునకుసాధ్యములుగానివియుఁబూర్వము పశుపక్ష్యాది శరీరములచేతఁదనకు ననుభవములయినవియునైన ఘాసచర్వణవిహాయ సగమనాదులనిప్పుడు, దాననుభవించి నట్లు గలిగెడి స్వప్నంబులును. నిద్రలో కేవలశిశువులకుగలిగెడి హాసము, పూర్వజన్మానుభూతప్రపంచ స్మరణపూర్వకస్వప్నానుభావ మేమైనందున, నిట్టిహాసంబు నివితనకుఁ బూర్వ జన్మాను భూతార్థ స్మరణ రూపములు, ఈదృష్టాంతముల వలనను, జీవులకుజన్మాంతరము, లనుమానప్రమాణముచేత నూహింపదగియున్నవి.

అయితే, పూర్వజన్మచర్యలు స్వప్నములో స్మరణమునకువచ్చునట్లయితె, పూర్వజన్మములు,తత్కార్యములుజాగ్రదవస్థయందిప్పుడు జ్ఞాపకమునకు రావచ్చుననియంటేని, యిప్పటిశరీరముతోనే తల్లిగర్భమునందును బాల్యమందును, జరిగినచర్యలు మానసేంద్రియాదిస్ఫూర్తి లేనందున జ్ఞాపకముండవు. ఇంతియేగాక, యీవలజరిగిన చర్యలును విస్మృతిగుణముచేత సప్రకారంబుగ జ్ఞాపకముండ నప్పుడు, పూర్వజన్మములో వేరైనవి స్థూలశరీరముచేత, ననుభూతములైనవియిప్పటి జాగ్రదవస్థాభిమానియైన స్థూలశరీరికెట్లుజ్ఞాపకమువచ్చును.

అయితే అప్పటియిప్పటి స్థూలశరీరములోనుండెడు సూక్ష్మశరీరమొక్కటియే గనుక నప్పటియిప్పటి స్థూలశరీరముచేతజరిగింపఁ

బడినచర్యలు స్వప్నాభిమానియైన సూక్ష్మశరీరికి గొన్నికొన్ని ఛాయ గా జ్ఞాపకము రావచ్చును.

అయితే, పూర్వజన్మచర్యలు స్వప్నములోనయినను సప్రకారం బుగజ్ఞాపకము రారాదాయనియంటేని? యిప్పటిజన్మమందు జేసినపను లే కాలవ్యవధి మొదలయిన హేతువులచేతసప్రకారంబుగనిప్పుడే జ్ఞాప కము రానప్పుడు, జాగ్రత్సుషుప్తులలోనికి తత్తరలాడుచునుండెడిస్వప్నా వస్థయందు జన్మాంతరములో వేరైనస్థూల శరీరముతో ననుభవించిన పనులుసప్రకారముగ నెట్లుజ్ఞాపకమునకు వచ్చును, గనుక నీయాక్షేప మున కవకాశము లేదు.

అయితే, యీస్వప్నము భ్రాంతియని చెప్పరాదాయనియం టేని! భ్రాంతియును బూర్వానుభూతార్థ విషయ మయినది యే యని, రజ్జుసర్పభ్రాంత్యాదులయం దనుభవసిద్ధమైయున్నది, గనుక, నందుకును బూర్వానుభవమే యావశ్యకమై యున్నది.

అయితే, యీజన్మములోనే పక్ష్యాదులయందు దృష్టములైన విహాయసగమనాదులు స్వప్నమందు భ్రాంతిచేతఁ దనయం దారోపి తములగుచున్నవని యొప్పినప్పటికిని నిద్రలోఁగేవలబాలురకు గలిగెడి హాసాదులకుఁ గారణమైన ప్రపంచచిత్రము లీజన్మములోఁ జూడఁబడి నవిగావుగనుక, యిందుకుఁబూర్వజన్మ ప్రపంచానుభవమే కారణమై యున్నదని యొప్ప వలయును. ఇందువలన జన్మాంతరములు గలవని నిశ్చయముగ నూహింప దగియున్నవి. కాలమునకుఁదుది లేదు గనుక జీవులకందఱకును క్రమక్రమముగ జ్ఞానాదులు గలిగి యెగువఁజెప్పిన ప్రకారము మోక్షముసిద్ధించినవెనుక, భగవంతుడుతనపరిణామమైన యపరప్రకృతిని. దానుధరించిన, శుద్ధసత్త్వమయమయిన దివ్యమంగళ విగ్రహమును, దిరోధానము జేసి, సత్యజ్ఞానానంద సర్వశక్తిస్వరూప

మాత్రావశిష్టుడై, యద్వైతమై యుండుటది మహాప్రళయావస్థయు, మఱల సృష్టిఁజేయవలెనని యాభగవంతుని కిచ్ఛగలిగినప్పుడుపూర్వోక్త ప్రకారముగ సృష్టిఁజేయ గలఁడు. చిదచిత్తులకు స్వరూప స్వభావ సంకోచముఁజేసి, తనయందు విశేషణములుగలీనముజేసికొని చిదచిద్విశిష్టుడయి స్వేచ్ఛచేత ధరింపబడిన దివ్యశరీరముతో వైకుంఠాది లోకములయం దుండుటది, యుగాంతర ప్రళయావస్థయు, నంతట మఱల సృష్టిసేయవలెనని యాభగవంతున కిచ్ఛగలిగి నప్పు డాజీవుల పూర్వజన్మకర్మములనాధారముఁజేసిసృష్టిఁ జేయుచున్నాడు. ఈయవస్థనుబట్టి, భగవంతుఁడుచిదచిద్విశిష్టుఁడనికొందఱును, జిదచిదీశ్వర వస్తుస్వరూపముల భేదమునుబట్టి, భేదమనికొందఱునుజెప్పుచున్నారు.

అయితే, క్రమక్రమంబుగ జీవులుమాత్రముముక్తులైన యనంతరంబును, బ్రపంచలీల ననుభవింపవలయునని, యీశ్వరునకిచ్ఛగలిగినప్పుడేలాగంటేని, యీశ్వరుడు పూర్వముసృష్టిఁజేసిన ప్రకారంబుగ మఱలనుపాధులచేత జీవులను గల్పింప గలడు' లేక యిట్లు సర్వజీవన్ముక్తిగలిగి యెడదెగక మున్నె జీవుల నుపాధుల చేత నప్పు డప్పుడు గల్పించను గలడు.

## జీవోత్పత్తివినాశములవిషయము.

అయితే, జీవునకుత్పత్తి వినాశములు గలవా యనియంటేని! యుపాధులచేత శుద్ధబ్రహ్మముతో లేశవ్యవస్థను బొందినతదంశములకే జీవత్వవ్యవహారము గనుక, నామరూపములు గల యుపాధులకేయుత్పత్తివినాశములుగాని బ్రహ్మాంశములకు లేవు. ఇందుకు బ్రమాణము గీతాశాస్త్రములో ద్వితీయాధ్యాయమందు' జీవుఁడుస్థూలశరీరోపాధులనుద్యజించుచు గ్రహించుచున్నాఁడనుచోటజీవభూతమయిన యాత్మనశించెడిదిగాదనిచెప్పియున్నది. (శ్లో॥ వాసాంసిజీర్ణాని యథా విహాయనవాని గృహ్ణాతినరోపరాణి । తథాశరీరాణి విహాయజీర్ణా-

న్యన్యానిసంయాతి నవానిదేహీ ॥ నైనంఛిందంతిశస్త్రాణి నైనందహతి పావకః । నచైనంక్లేదయంత్యాపో నశోషయతి మారుతః । అచ్ఛేద్యోయమదాహ్యోయ మక్లేద్యోశోష్యఏవచ । నిత్యస్సర్వగతస్థాణు రచలోయంసనాతనః॥) అనియున్నది.

అయితే, నామరూపోపాధులకు వినాశముగలదని చెప్పినపక్షమందునామ రూపోపాధులు ప్రకృతి సంబంధములే గనుక ప్రకృతికి నాశముగలుగలేదా ! భగవద్గీతలలో త్రయోదశాధ్యాయ మందు ॥ (శ్లో ॥ ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీఉభావపి।) అనిచెప్పియున్నదే,యాదిలేని వాటికంతము గల్గదని యెగువ మీరుచెప్పినందుకు విరోధమురాదాయనియంటేని ! ఏకమయినబ్రహ్మముతానే ప్రకృతిపురుషరూపమయిన పరాపర ప్రకృతులుగా నగుచున్నాఁడని యెగువజెప్పియుంటిమి, ప్రకృతిపురుషులు వస్తుతత్వముచేత బ్రహ్మమేగాని వేరుగాదు. యిందుకు ప్రమాణము, గీతాశాస్త్రములో నవమాధ్యాయమందు, సదసచ్చాహమర్జున, యనియున్నది, గనుక ప్రకృతిపురుషులనాదులనిచెప్పుటది, యీరెండును బ్రహ్మమేయనునట్టి భావముచేతనేగాని, వాటినామ రూపోపాధులు నడుమవచ్చి నశించునవి గనుక వీటినిబట్టి యనాదులనిచెప్పుటకాదు. ఇందుకుప్రమాణము. ఛాందోగ్యములో నారవ యధ్యాయమందు, ఆత్మను తెలుసుకొంటే తత్స్వరూపములయిన యవి యన్నియు దెలిసి నట్లే యనిచెప్పి, యిందుకు మృత్పిండము దెలిసిన మృద్వికారము లన్నియు దెలియ బడినట్లు నీ దృష్టాంతములను జూపించిన చోట వికారనామధేయములు వాగ్వ్యవహార మాత్రము లనియు, మృత్తికే సత్యమనియు జెప్పియున్నది. గనుక పరాపరప్రకృతులని బ్రహ్మముతో భేద వ్యవస్థను గలుగజేసెడి నామ రూప ములకు మాత్రము నాశము గలదు గాని ప్రకృతిపురుషస్వరూపముగానయిన బ్రహ్మమునకు నాశము లేదు. మరికొందఱు

సచ్చిదానందస్వరూపము బ్రహ్మమని చెప్పియుండెడిశ్రుతికి, సత్తనగా ప్రకృతియనియు, చిత్తనగ జీవులనియు, నానందమనగ బ్రహ్మమనియు, నిమ్మూడునుగూడి బ్రహ్మస్వరూపముగనుక వీట్లయొక్క నామరూపములును నిత్యములనియుఁ జెప్పుచున్నారు. అట్లుచెప్పగూడదేలనంటేని! మీదవ్రాసినశ్రుత్యర్థములో నామవికారములు వాగ్వ్యవహారమాత్రములనియు, మృత్తికే సత్యమనియుఁ జెప్పియున్నందున నామరూపములు నడుమ వచ్చిపోవునవి గనుక నిత్యములని చెప్పగూడదు. దీని నొప్పక ప్రకృతిస్వరూపములయినఘటాదులకుఁ బ్రాగభావ ప్రధ్వంసాభావములయందును ఘటమున్నదని స్వసంకేత సిద్ధాంత యుక్తులను జెప్పుచు నథవా ఘటరూప నాశానంతరంబున గపాలావస్థయు, వెనుక చూర్ణావస్థయు నిట్లవస్థాంతరములుగలుగునేగాని యాత్యంతిక నాశము మృత్స్వరూపమున కెట్లుగలుగదో, యటులనే ప్రకృతిస్వరూపములకాత్యంతిక నాశము గలుగదని చెప్పుచున్నారు.

అయితే, కఠినమయిన పదార్థముల కాత్యంతిక నాశము తత్కాలములో గనుపట్టకపోయినను, దీపము మలిపితే తక్షణములో నాత్యంతిక నాశముగలుగుట ప్రత్యక్ష సిద్ధముగానున్నదే యనియంటేని ! దీపముమలిపినవెనుక దాని పరమాణువు లుంటున్న వనియు, నవిమిగుల సూక్ష్మమగుటవలన మననేత్రములకుఁ దెలియరావనియుఁ జెప్పుచున్నారు, ఇట్లుయుక్తులుచెప్పెడిపక్షములోనగుపడెడుపదార్థములు లేవనియును జెప్పవచ్చు నెట్లంటేని ! యేపదార్థమయినను, బూర్వమందును బరమందును లేక నడుమ గలిగినట్లు దోచుచున్నదో, యట్టి పదార్థము వర్తమాన కాలములోనును భ్రాంతియని చెప్పవచ్చునేయనియంటేని ! యిందుకు ప్రత్యుత్తరము లేక, మాసిద్ధాంతమిదియని చెప్పుచున్నారు. ఈయుక్తులచేతనే పరమాణు కారణవాదు

లున్ను నిరసింపబడుచున్నారు, గనుక నిట్టియుక్తికిరాని స్వసంకేత సిద్ధాంతములు సరియైనవిగావు.

అయితే, సర్వస్వతంత్రుడయిన బ్రహ్మము తన సంకల్ప ప్రకారము ప్రపంచలీలలననుభవించుచున్నాడని మెుగువజెప్పితిరి.

## నిర్గుణబ్రహ్మము సగుణమగు విధము.

నిర్గుణమయినబ్రహ్మము సగుణబ్రహ్మమై యెట్లు ప్రపంచమును సృష్టించినాడనియంటేని! యిందుకద్వైతులు మాయాసంబంధమువలన సగుణబ్రహ్మమయిసృష్టించినాడనిచెప్పుచున్నారు. ఆమాయ యెక్కడిదనియంటేని, బీజమందంకురశక్తియున్నట్లునిర్గుణబ్రహ్మమందనాదిగ మాయాశక్తియుంటున్నదనిచెప్పుచున్నారు, ఆమాయ బ్రహ్మస్వరూపమా, లేకయతిరిక్తమాయనియంటేని,అతిరిక్తమేయనిచెప్పుచున్నారు. అతిరిక్తమయిన మాయయుండిన యెడలద్వైతమురాదాయని యంటే! మాయ, త్రికాలములయందు సత్యముగనుండక, జ్ఞానముచేత బాధితమయిపోవుచున్నది, గనుక ద్వైతాపత్తి రానేరదని చెప్పుచున్నారు. మంచిది, జ్ఞానముచేత బాధితమయ్యేడిలోపలనయినను మాయయుంటున్నదిగదా యప్పు, డద్వైతమునకుహానిరాదాయనియంటేని ! యామాయ, యవస్తువు గనుక వర్తమానకాలమునందును నద్వైతమునకు హానిలేదని చెప్పుచున్నాడు. మాయయవస్తువైతే బ్రహ్మమునకుదాని సంబంధమెట్లు గలుగు ననియంటే ! రజ్జువందు సర్పమువలె భ్రాంతిచేతగల్పితమగుచున్నదని చెప్పుచున్నారు. జ్ఞానస్వరూపుడయినబ్రహ్మమునకు భ్రాంతి గలుగునా యని యంటే, భ్రాంతియని యనుకొనుటయును, భ్రాంతియే యని చెప్పుచున్నారు. అట్లు భ్రాంతియని యనుకొనుటయును భ్రాంతియైన పక్షములో బూర్వము భ్రాంతియని యనుకొనుటది యథార్థమే యగుచున్నది. గనుక నందుల విషయము

లన్నియు సత్యములుగావలసి వచ్చును, కాబట్టి ద్వైత ప్రసక్తివచ్చు చున్న దేయనియంటే ? ఇందుకుసదుత్తరమును జెప్పజాలకసమాధిచేసి చూచితే నిర్వికల్పములోఁ బ్రపంచముతోచలేదు గనుక మిథ్యయనియు జెప్పుచున్నారు. ఇందుకు నిద్రలో బ్రపంచము తోచలేదే, యంతమాత్రము చేతనే లేదని యెట్లు చెప్పవచ్చును, జాగ్రతలోగూడా మనకుఁ దెలియని దేశములుఅంశములును లే నట్టాయనిచెప్పితే, అందుకు యుక్తి చెప్పజాలక వీరితోవాదముచేయజాలక మౌనమే వ్యాఖ్యానమనిచెప్పు చున్నారు, గనుక నిదియుక్తిసహముగా నుండలేదు.

అయితే, యిందుకు నేనుజెప్పెడి క్రమ మేమనిన . ఏకమైసత్య జ్ఞానానంద స్వరూపమయిన నిర్గుణ బ్రహ్మము స్వేచ్ఛచేత జడచిదీశ్వరస్వరూపుడై స్వాధీనమాయకుడై నియంతగానాత్మలుగానింద్రియములుగాను విషయములుగానుదానేయై తనకుస్వరూపముగానుండెడి సత్యజ్ఞానానంద సర్వశక్తులను గుణరూపముగా ననుభవించుచున్నాడు గనుక, నప్పుడు సగుణబ్రహ్మమనిచెప్పఁబడు చున్నాఁడు. ఎందు వలన నంటేని ? సత్యజ్ఞానానంద సర్వశక్తిస్వరూపుఁడయిన నిర్గుణబ్రహ్మము సృష్టియందుఁ జడచిదీశ్వరస్వరూపముగఁదానే యగుచున్నాఁడు. గనుక స్వరూపముగా నుండెడి సత్య మనగఁదాను త్రికాలములయందు నుండుట.

అయితే, యచిత్తు తనపరిణామములయిననామరూపములచేత నర్థక్రియాకారియగుచు భ్రాంతి రూపములుగాక కొంతకాలముండి నామరూపములుపోయిన వెనుక నశించినట్లు తోచునదిగనుక, నీనామ రూపాత్మకమయినవర్తమానకాల సత్యత్వముబ్రహ్మపరిణామమయిన యచిత్తుకు గుణరూప మగుచున్నది, బ్రహ్మమునకు స్వరూపముగనుం డెడిజ్ఞానము త్రికాలములయందసంకుచిత మయినది,

అయితే, చిత్స్వరూపులయిన జీవులకు విషయసంబంధముగలిగినప్పుడా విషయజ్ఞానమింద్రియముల ద్వారాగలిగి విషయసంబంధము లేనప్పుడు విషయ జ్ఞానంబే లేకయుంటున్నది. గనుక నీ సంకుచిత జ్ఞానము బ్రహ్మపరిణామములయిన జీవులకు గుణరూపమగుచున్నది, బ్రహ్మమునకు స్వరూపముగానుండెడి యానందము త్రికాలముల యందఖండముగ నిరవధికమయినది.

అయితే, చిత్స్వరూపులయిన జీవుల కిష్టవిషయ ప్రాప్తిగలిగినప్పు, డింద్రియముల ద్వారముగా నానందముగలిగి యట్టివిషయప్రాప్తిగలుగనప్పు డాయానందము లేకయుంటున్నది, గనుకనీఖండమయిన యానందము బ్రహ్మపరిణామములయిన జీవులకుగుణరూపమగుచున్నది స్వరూపముగ నుండెడి జ్ఞానానందములు జీవున కజ్ఞానముచేత నెప్పుడును బ్రతిభాసింపకపోయినప్పటికిని విషయసాన్నిధ్యముగలిగినప్పుడు ప్రతిభాసించుచున్నవి, గనుక నిందువలన విషయజ్ఞానమనియు,విషయానందమనియుఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మమునకు స్వరూపముగనుండెడి సర్వశక్తి, బ్రహ్మము తానేలాగుననిచ్ఛయించుచున్నాఁడో, యాలాగున నగుట.

అయితే, యచిద్వస్తువులయందు గొన్నింటిలోఁ గొన్నిశక్తులు మాత్రమేయుంటున్నవి, గనుక నీయల్పశక్తులు బ్రహ్మపరిణామమయిన యచిత్తుకు గుణరూపము లగుచున్నవట్టి సత్యజ్ఞానానంద సర్వశక్తి స్వరూపుఁడయినబ్రహ్మమే శుద్ధ సత్వమయ దివ్య మంగళ శరీరమును ధరించి, యనంతకళ్యాణగుణ పరిపూర్ణుఁడయి, స్వాధీనమాయకుఁడయిసర్వజ్ఞుడయి, చిదచిద్రూపప్రపంచమునకునియామకుడగుచున్నందునప్రపంచలీలను గుణరూపముగ ననుభవించు చున్నాఁడు. ఇందువలన నిర్గుణబ్రహ్మముచిదచిదీశ్వరరూపముల చేత సగుణ బ్రహ్మమగు

చున్నాడు. ఇందుకు ప్రమాణము, గీతాశాస్త్ర మందుఁ ద్రయోదశాధ్యాయములో, (నిర్గుణంగుణభోక్తృచ) అనియున్నది.

## నిర్గుణశబ్దార్థ నిర్ణయము.

అయితే, యిందు కద్వైతులు, నిర్గుణమనగ, నేగుణములు లేనివాఁడనియు గుణభోక్తృచ, అనగ ఆయనే భ్రాంతిచేతసత్వాది గుణముల ననుభవించు చున్నాడనియు నర్థము జెప్పుచున్నారు. సత్య జ్ఞానానంద స్వరూపుడయిన బ్రహ్మమునకు భ్రాంతిగలుగదనెడి యంశ మునుమున్నే వివరించి యున్నాడను, గనుక నిదిసరిగాదు, ద్వైతులు నిర్గుణమనగ, హేయగుణ రహితుఁడనియు, గుణభోక్తృచ అనగ, ననంతకళ్యాణగుణముల ననుభవించుచున్నాడనియుఁ జెప్పుచున్నారు. అట్లుచెప్పుటది యుక్తముకాదేలనంటేని ? నిర్గుణమనెడుపదమునకు హేయగుణరాహిత్యమర్థమని చెప్పినయెడల గుణశబ్దమునకుసంకోచమువచ్చు నిదియునుంగాక, గీతలలోనిచ్చోటనే జ్ఞేయమయినబ్రహ్మ స్వరూపే నిరూపణంబు జేసిన. (శ్లో ॥ అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే।) అనెడి శ్లోకము మొదలుకొని (అవిభక్తంచభూతేషు విభక్తమివచస్థితం।) అనుశ్లోకము వరకు బ్రహ్మము యొక్క విచిత్ర శక్తిప్రకాశార్థముగఁ బరస్పరవిరుద్ధ ధర్మములుగలుగుటయే ప్రతిపాదింపబడియున్నవి. గనుక, తన్మధ్యఘటకమయిన (నిర్గుణంగుణభోక్తృచ) యనుటకున దేరీతిగ నర్థవర్ణనము జేయుటయావశ్యకము గనుకను, నిర్గుణమనుట కవ్యవహితోత్తరముగ, గుణభోక్తృచయని యుండుటవలనను, నిర్గుణమనెడి పదముచేత నేహేయగుణములు నిరసింపబడినవో, (గుణభోక్తృచ) యనెడి పదముచేత, నాహేయగుణములనే యనుభవింపు చున్నాడని చెప్పవలసి యుంటున్నది. కాబట్టి కారణావస్థయందు సామాన్యముగ నేగుణములు లేవనియుఁ గార్యా

వస్థయందు హేయాహేయగుణములను జీవేశ్వర భేదముచేత దానే యనుభవించుచున్నాడని చెప్పవలయును. మఱియుఁ గొందఱు ద్వైతాద్వైతసవికార నిర్వికార సవిశేష నిర్విశేష శ్రుతులకు విరోధ పరిహారార్థమయి బ్రహ్మము కన్న చిదచిత్తులు వేరనియు, బ్రహ్మమునకీ రెండును నపృథక్సిద్ధ విశేషణములుగ శరీరమై యుంటున్నవనియు జెప్పుచున్నారు. చిదచిత్తులు బ్రహ్మము కన్న వేరని చెప్పుట వలన నద్వైత శ్రుతికిన్ని, జిదచిత్తులెంత యపృథక్సిద్ధ శరీరమయినను శరీరికిశరీరము విశేషణమే యగుచున్నది. గనుక నిర్విశేష శ్రుతికిని సమంజసముగా లేదు. మఱియును, బ్రహ్మమునకు జిదచిత్తు లపృథక్సిద్ధ విశేషణములు గనుక నా బ్రహ్మము జగంబున కుపాదానకారణమగుచున్నాడని వారు జెప్పుచున్నారు. ఎట్లంటేని, చైత్రో గచ్ఛతి యనెడు ప్రయోగము వలన శరీరధర్మమయిన గమనాదులు శరీరియందు ముఖ్యముగ వర్తించి నట్లు బ్రహ్మమునకు శరీరమయినయచిత్తు జగదుపాదానకారణమగుట వలన నీయచిత్పరిణామ మెగువజెప్పిన దృష్టాంత ప్రకారముగ బ్రహ్మమందు ముఖ్యముగ వర్తించుచున్నదని చెప్పుచున్నారు. ఆపక్షమందు చిత్తును శరీరంబే గనుక చిద్గతాజ్ఞానదుఃఖాదులును, ముఖ్యముగ బ్రహ్మమందువర్తింప వలసినదియే గదా యనియంటేని! చిద్గతాజ్ఞానదుఃఖాదులు మాత్రము లేవని చెప్పు చున్నారు. ఇంతకన్న నసంగతం బేమియున్నది, యిదియునుంగాక చిదచిత్తులు బ్రహ్మమున కపృథక్సిద్ధవిశేషణముల య్యేడిపక్షములో నెప్పుడు నిమ్మాటికి విశ్లేషము గలుగకుండు నట్లీ ప్రపంచాకృతిగ బరిణమించిన యెడల విశేష్యమయిన బ్రహ్మమునకు వికారము రావలసియుండును. అట్లుగాక, యేకదేశ సంబంధము చేతనైన నపృథక్సిద్ధములుగ నిమ్మాడునుంటున్నవనుటకు నవకాశము లేదు. ఎందువలననంటేని ! శరీరమందు జీవుడును దదంతర్యామిగ నీశ్వరుడు నుండి సమస్తకార్యంబులను జేయించుచు జీవుడు పోయిన వెనుక, జీవ

కార్యములయిన వృద్ధ్యాదులు నీశ్వర కార్యము లయిన ప్రేరణాదులును గనుపడలేదు గనుక, చిదచిత్తులు బ్రహ్మమునకు నపృథక్సిద్ధవిశేషణములుగనుంటున్నవని చెప్పఁ గూడదు, గావునబ్రహ్మమునకుఁ గారణావస్థయందు సత్యజ్ఞానానంద సర్వశక్తులు స్వరూపమగుటవలన బ్రహ్మము నిర్గుణ మనియు, నద్వైత మనియు, నిర్విశేష మనియు, నిర్వికార మనియు, గార్యావస్థయందు జిదచిదీశ్వరస్వరూపముగనై జగంబునకభిన్ననిమిత్తోపాదాన కారణమగుచున్నాడు. గనుక జీవేశ్వరద్వైతమనియు, సగుణమనియు, సవిశేషమనియు, సవికార మనియు జెప్పబడుచున్నాడు. ఇది శాస్త్రమునకు విరోధములేకను, యుక్తి సహముగనున్నది.

అయితే, బ్రహ్మమెప్పుడునుసగుణమనియే చెప్పరాదా? సృష్టికిఁబూర్వము నిర్గుణమనియేల జెప్పవలెనంటేని, సృష్టికి బూర్వమాత్మ వేఱుగా సత్యజ్ఞానానందాదులు వేరుగలేవు. ఎందువలన నంటేని, సత్యజ్ఞానానందాదులు గుణముల వ్యాడిపక్షములో విషయములుండి యావిషయానందము లింద్రియద్వారముగా నాత్మకు గుణరూపములుగ ననుభవమునకు రావలసినదిగనుక, విషయములు నింద్రియంబులు లేని యప్పుడిసత్యజ్ఞానానందము లాత్మకెట్లుగుణరూపము లగును, అటుల నేవిషయము లేయింద్రియంబులేక యున్నప్పుడు సత్యజ్ఞానానందమే యాత్మస్వరూపము గనుక, నాత్మకన్న వేరుగ సత్యజ్ఞానానందములు గుణరూపంబులుగ లేవు. అందువలన సృష్టికిఁబూర్వముసత్యజ్ఞానానంద స్వరూపమే నిర్గుణ బ్రహ్మమని చెప్పఁబడుచున్నాఁడు, బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపమనిశ్రుతుల యందుఁజెప్పఁబడి యుండుటవలన వైదికులట్లంగీకరించుటయావశ్యకమయినప్పటికిని నవైదికులట్లంగీకరించుటకుఁ బ్రమాణమేమన్నను. సత్యజ్ఞానానందములుబ్రహ్మమునకుస్వరూపముగావనియు, నవిగుణంబులేయనియు, లోకదృష్టప్రక్రియను బట్టియంగీకరించిన యెడల

గుణములకునుగుణికిని భేదముజెప్పవలసివచ్చు నాపక్షమందు బ్రహ్మము ప్రపంచమును సృష్టింపవలెనంటే ? యుపాదానకారణమయినయచిత్తును దీనింబరిణమింప జేయుటకు దగిన యుపకరణంబులు, విలక్షణ సుఖదుఃఖభోక్తలయిన యనేకజీవులు, నిన్నియు ప్రత్యేకంబుగనుండవలసి వచ్చును. ఇన్నిపదార్థములను బ్రహ్మముకన్న వేరుగ నొప్పెడి పక్షమందీ సకలప్రపంచంబును సృష్టించువాడు బ్రహ్మ మొకడేయని చెప్పుటయందును సందేహముగలుగుచున్నది. యెందువలననంటేని ! ప్రకృతిని జీవులను బ్రహ్మముకన్నవేరుగనొప్పెడిపక్షములో లోకమందు బుద్ధిమంతులయినవారు వస్త్రంబులనితరోపకరణంబులచేత ననేకవిచిత్రంబులుగజేసి వేషమునుధరించిన రీతిగ నాయాజీవులు తమతమజ్ఞాన తారతమ్యములచేత నితరోపకరణములవలన బ్రకృతిసంబంధములయిన నర మృగ పశు పక్షి వృక్ష పాషాణాద్యాధునిక శరీరము లెత్తుటకు వారలేపూర్వముకారణంబులుగావచ్చును. అట్లుగాదేని మరికొందరు, దేవతలు వీరలజన్మములకుఁ గారణములనియైనను జెప్పవచ్చును. అట్లులేక యీశ్వరుండే వీరలకు గారణమని చెప్పెడిపక్షములో నీశ్వరునకుమరి యొక యీశ్వరుడున్నాడనియు, నూహింపవలసివచ్చును. అట్లుగాక యీశ్వరుడొక్కండేయని శాస్త్రమునుబట్టియొప్పెడిపక్షమందట్టిశాస్త్రమునకు వారైనను బద్ధులుగావలసి యుంటున్నది. అట్లు సంకేతముగానుండనిగుణమయిన బ్రహ్మమొకడే నానావిధ ప్రకృతి పురుషాత్మకమయినప్రపంచంబుగ నగుచున్నాడనుటకుఁదగిన దృష్టాంతములను వివరింపుచున్నాడ నెట్లంటేని ! ఒకవటబీజముతనకన్నవేరుగ వృక్షశాఖాపత్రపుష్పఫలాది భేదములెవ్వియును లేక, నేయుపకరణములును లేక, తానే యుపాదానకారణమయి వృక్షాకారంబుగనెట్లు పరిణమించుచున్నదో, యారీతిననే బ్రహ్మముతానే యుపాదాన కారణమయి ప్రపంచాకారంబుగఁబరిణమించుచున్నాడు.

## ప్రపంచమునకు బ్రహ్మమభిన్న నిమిత్తోపాదాన కారమనుట.

అయితే, వటబీజము జడ మయిన పదార్థము గనుక సంక ల్పాదులు లేనందున దీని ప్రరోహమునకు నిమిత్తకారణమయిన యొకపురు షుడుండ వలసియున్నది. గనుక వటబీజదృష్టాంత ముపాదాన కారణ త్వమందేను, బ్రహ్మము సత్యజ్ఞానానంద సర్వశక్తి స్వరూపుడు గనుక సంకల్పపరిణామము లాయనకే గలుగుటవలన నభిన్న నిమిత్తోపాదాన కారణమగుచున్నాడు, ఇందుకు దృష్టాంతము, ఊర్ణనాభి యభిన్న నిమిత్తోపాదానకారణమయి తనయిచ్ఛానుగుణంబుగఁ దనస్వరూపము చేతఁ దంతుసృష్టిప్రళయముల నెట్లు సేయుచున్నదో, యాప్రకారము బ్రహ్మమీప్రపంచసృష్ట్యాదులను జేయుచున్నాఁడు.

అయితే, ఊర్ణనాభి సృష్టిలోఁజేరిన చిదచిదాత్మకమయిన పదార్థము గనుక తనయందు గలిగి యుండెడి చేతనాచేతనధర్మ ములవలనదంతుసృష్టినిగుఱించి నిమిత్తోపాదాన కారణమగుచున్నది. బ్రహ్మమయితేను సృష్టిలోచేరినదిగాదనగ, జగంబంతయు నెట్లుబ్రహ్మ పరిణామమో, యారీతిగబ్రహ్మముమరియొకదాని పరిణామము గాదు. గనుకనుస త్యజ్ఞానానంద సర్వశక్తిస్వరూపు డగుట వలనను, దానేస్వ సంకల్పానుగుణముగఁ బరిణమించి జగంబున కభిన్న నిమిత్తోపాదాన కారణమగుచున్నాడు. గనుకనీప్రకారము తనయందు గుణరూపముగా నేమియును లేక సత్యజ్ఞానానంద సర్వశక్తి స్వరూపుడయిన నిర్గుణ బ్రహ్మము ప్రపంచసృష్టిని జేయవలయునని సంకల్పించి తానేయారీతిగ బరిణమించుచున్నాడు, గనుక, తనకన్న భిన్నముగా నేవస్తువుయును లేక నేయుపకరణాపేక్షయును లేక, తనయేకత్వమునకు హాని లేకుండు నట్లు ప్రపంచమున కభిన్న నిమిత్తోపాదాన కారణ మగుచున్నాడని శాస్త్రముచేతను యుక్తిచేతను నిర్ణయింప బడుచున్నాడు.

## బ్రహ్మమునకవస్థాత్రయము.

ఈబ్రహ్మమునకును మూఁడవస్థలు గలవెవ్వి యనిన, సృష్టికిఁ బూర్వము సత్యజ్ఞానానందస్వరూపుఁడయి సృష్టీచ్ఛాదులు లేకయుండు టది నిష్కళావస్థయు, నానావిధ ప్రపంచసృష్టిసంకల్పముతోఁగూడి విషయసృష్టిలేక విషయ జ్ఞానమాత్రముతో నుండుటది సకళనిష్కళావస్థయు, నాసంకల్ప ప్రకారముగ విషయసృష్టి జేసి యావిషయానందము ననుభవించుటది సకళావస్థయు ననంబడు, నీయంశము శాండిల్యోపనిషత్తులో జెప్పబడియున్నది. యీసకళావస్థావిశిష్టుఁడయిన బ్రహ్మమే సృష్టి స్థితిలయముల కొఱకు లీలార్థమయి బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపములను ధరించుచున్నాఁడు. వీరలేకొన్ని హేతువులచేత విభవార్చావతారములెత్తుచున్నారు.

అయితే, సత్య జ్ఞానానంద స్వరూపమయి పూర్ణుఁడయిన బ్రహ్మము పైనజెప్పిన ప్రకారము జీవాది జగద్రూపంబుగఁ దన్ను సృజించుకొనుటకును విభవార్చావతారము లెత్తుటకును నిమిత్తమేమనిన, సర్వశక్తి స్వరూపుఁడయిన యాబ్రహ్మము యొక్క యిచ్ఛయే గాని వేరుకాదు. అదియెట్లంటేని, సర్వాధికారియైన యొక చక్రవర్తి తనయొద్ద పనులుసేయువారనేకులుండినను దాను లీలార్థమై శ్రమకరములయిన శిల్పాది కర్మములు సేయుచున్నాఁడు. అందులకా చక్రవర్తియిచ్ఛదక్క వేరేకారణములేదుగదా! యదియునుంగాక, రసములలో మధురరసము సర్వోత్తమ మయినను రసాంతర సంబంధములేక తద్రసమునే యేకరీతిగ ననుభవించువారికి విశేషానుభవము వలన, నరుచి గలుగుచున్నది. నడుమనడుమ నామ్లలవణాదిరసముల ననుభవించిన యెడల నామధుర రసము విశేషశ్లాఘ్య మగుచున్నది. ఇదేరీతిగ బ్రహ్మమునకును సత్యజ్ఞానానంద సర్వశక్తులు స్వరూపమై

యేకొంతయు లేకపోయినను దన స్వరూపమయిన సర్వశక్తిప్రకాశార్థముగ జిదచిద్రూపప్రపంచముగ దన్ను సృజించుకొనియాజగంబునకు దానే యీశ్వరుడుగ నేర్పడిస్వరూపానందాదులను గుణరూపములు గననుభవించుచున్నాడు.

## అవతారనిమిత్తము.

ఇదేరీతిగ సర్వశక్తి గలభగవంతుడు విభవార్చావతారములనుగొన్ని నిమిత్తములచేత దుష్టశిక్షయు, శిష్టరక్షయుఁ జేయుటకెత్తుచున్నాడు. ఇంతమాత్రంబున కవతారంబులెత్తవలెనేయనియుంటేని ; తనయవతారకథలువినియవ్వియవస్థలయందాయాకథారసమునుబట్టి రసోదయమగుటవలన దనయందుమనసు నిలిచి లోకులుకృతార్థులగుటకును, స్వనామసంకీర్తన గుణకథనాదులచేతఁ బాపపరిహారము గలుగుటకును, దత్వవిషయములో దనవాక్యములు మొదలయినవాటిచేతలోకశిక్షనేర్పఱచుటకు నవతరించుచున్నాడు. ఇందులో మొదలి రెండు హేతువులకుఁ బ్రమాణము. శ్రీభాగవతము దశమస్కంధములోఁబ్రథమాధ్యాయమందు. (శ్లో॥ వాసుదేవకథాప్రశ్నః పురుషాన్ త్రీన్పునాతిహి । వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ తత్పాదసలిలంయథా॥) అనిచెప్పఁబడియున్నది, వెనుకమూడవహేతువుకుబ్రమాణము, దశమస్కంధములోత్రయస్త్రింశాధ్యాయమందు. (శ్లో॥ ఈశ్వరాణాం వచస్సత్యం తథైవాచరితంక్వచిత్ । తేషాంయత్స్వవచోయుక్తం బుద్ధిమాన్ స్తత్తదాచరేత్॥) అనియున్నది.

అయితే, దీనినొప్పకకొందఱు విమతస్థులు సర్వశక్తిస్వరూపుడయిన భగవంతుడు స్వసంకల్పమాత్రముచేతనే యిష్టసిద్ధినిబొందవచ్చునే, యట్లుగాక మనుష్యులవలెనే జన్మకర్మాదులను జరిగించినారుగనుక, రామకృష్ణాదులు మనుష్యులేగాని భగవత్స్వరూపులు

గారని చెప్పుచున్నారు.

## రామకృష్ణాదులుభగవదవతారములనుట.

అందుకు సర్వశక్తిగల భగవంతుడు కార్యకోటిలోఁ జేరినవాని వలెనేకర్మబద్ధుడుగాక తానేకమయి పూర్ణుఁడయ్యును లీలార్థముగఁ జిదచిదీశ్వరస్వరూపమయిన ప్రపంచాకృతిగ నెట్లగుచున్నాఁడో యారీతిగనేయవతారము లెత్తుచున్నాడు. ఈయవతారములుకర్మబద్ధములుగావు. లోకానుగ్రహార్థమయి సేయఁబడినవని సహేతుకములయిన సమాధానములు మీఁదఁజెప్పబడినను దురభిమానముతో నొప్పుకొనక హాస్యముసేయుచున్నట్టి వారి మతములలోఁ గారణమని చెప్పబడెడు దేవుడు, సర్వశక్తిసర్వజ్ఞత్వాదులకు లోపకరములయిన యనేక కార్యములను జరిగించినట్లు వారిమతగ్రంథములలోనే స్పష్టమగుచున్నది.

అయితే, యీయంశమును వారికిఁబ్రతిబంది జెప్పుటయేగాని కర్మవశ్యుడుగాని సర్వశక్తిగల భగవంతుడందఱికి నొక్కఁడే గనుక నెట్లుచేసినఁజేయవచ్చును. సత్యజ్ఞానానందసర్వశక్తులుబ్రహ్మమునకు స్వరూపమనుటకు నెగువఁజెప్పబడిన మూడవస్థలవలననిర్గుణబ్రహ్మము సగుణబ్రహ్మముగనగుచున్నాఁడనుటకునుబ్రహ్మముగనుపట్టనివాఁడయినందున శాస్త్రసంకేతమునకు సంబంధించినయుక్తుల నెగువఁ జెప్పినాడను. అందుకుదృష్టాంతములీక్రింద వివరించుచున్నాఁడను.

## జీవులందుజ్ఞానానందసర్వశక్తులుగలవనుట.

జీవులుపాధివలన బ్రహ్మముతో లేశ వ్యవస్థను బొందినవారే గనుకజీవులకును మూడవస్థలుగలవు. ఈజీవులయందే యెగువజెప్పిన భావమును జూపించుచున్నాఁడ నెట్లంటేని; సుషుప్తియందు జ్ఞానా

నంద.సర్వశక్తులు స్వరూపముగనున్నవి, యట్లుగాని యెడల స్వప్న మందే యింద్రియములు నేవిషయములును లేకనే యన్నింటి నేర్పఱచు కొని విశిష్టుడయి జీవుండానందాదుల నెట్లనుభవించును. ఈజీవుడే జాగ్రదవస్థను బొందినప్పుడు స్వరూపానందములను విషయేంద్రియ ద్వారముగాగుణరూపములుగ భేదరూపుడై యనుభవించుచున్నాడు. ఈమూడవస్థలయందును జీవుడవిద్యోపాధి విశిష్టుడు గనుక స్వస్వ రూపజ్ఞాన తిరోధానము మాత్రము గలిగియున్నది. బ్రహ్మమునకైతే స్వరూపజ్ఞాన తిరోధానముండదు గనుక నీదృష్టాంతమువలన బ్రహ్మ మునకు మొదల జ్ఞానానంద సర్వశక్తులు గుణరూపములుగా నుండక స్వరూపముగానేయుండినందున బ్రహ్మము నిర్గుణమనియు నిర్వికార మనియు నద్వైతమనియు ననంతరము తనసర్వశక్తి ప్రకాశము కొఱ కభిన్న నిమిత్తోపాదాన కారణరీతిచేతఁ జిదచిదీశ్వర స్వరూపమైన ప్రపంచముగఁబరిణమించి స్వరూపముగ నుండెడి జ్ఞానానందాదులను గుణరూపములుగ ననుభవించుచున్నాడు, గనుక నప్పుడుసగుణమనియు జిదచిదీశ్వరభిన్నమనియు, బ్రహ్మమువ్యవహరింప బడుచున్నాడు.

అయితే, యజ్ఞాన దుఃఖాదులుగలచిత్తుగాను, షడ్భావవికార ములుగల యచిత్తుగాను అనంతకళ్యాణ గుణములుగల యీశ్వరుడు గాను నిర్గుణబ్రహ్మమే పరిణమించు చున్నాడని చెప్పక చిదచిదీశ్వ రుల కెప్పటికిని భేదమనియే చెప్పరాదా యనియుంటేని ! అజ్ఞాన దుఃఖ వికారాదులును ఆయన సర్వశక్తిస్వరూప ప్రకాశము లేగాని వేరుగావు. ఇంతియేగాక, చిదచిదీశ్వరులకు భేదము నొప్పెడి పక్ష ములో నింక ననేకభేదము లొప్పవలసి యుండు నాపక్షములోనీశ్వ రునకు మఱియొక యీశ్వరు డున్నాడనియి ట్లనవస్థా ప్రసంగమువ చ్చుచున్నదనెడు నంశము నెగువఁ జెప్పి యున్నాడను. గనుక ప్రపం చమంతయు బ్రహ్మస్వరూపమే యని చెప్పవలయునది. అట్లుగాక భేద

మేవాస్తవమయిన పక్షములో నీశ్వరునినమ్మి జీవుఁడు కడతేర వలసినది న్యాయమే గనుక భగవంతుని నమ్ముమని చెప్పుట తప్పుగాదు.

## నిరీశ్వరవాదనిరాకరణము.

అయితే, కొందఱీశ్వరుఁ డగుపడుటలేదు గనుక లేడనిచెప్పు చున్నారు. అదియుక్తంబుగా దెందువలననంటేని ! నానావిధచిత్ర మైన ప్రపంచంబును జీవులయొక్క పూర్వజన్మకర్మములు జడముల గుటచేత వాటినిబట్టి దారిద్ర్య భాగ్యములను రోగ మరణాదులను గాలాను గుణముగ గలుగఁ జేయుట కవశ్యమీశ్వరుని నంగీకరింప వలయునది.

అయితే, జన్మాంతరమే యబద్ధమనియు వస్తుసంయోగ స్వభావముచేత నీమనుష్యాది సృష్టియు, ప్రయత్న లోపాలోపముల వలన భాగ్య దారిద్ర్యములు గలుగుచున్నవనియుఁ గొన్ని హేతువుల వలన రోగములుగలిగి, యీవస్తు సంయోగము శిథిల మయినందున మృతి బొందినాఁడనెడి వ్యవహారము గలుగుచున్నదనియు, నీవస్తుసంయోగ మువలన వృద్ధినొందెడు గుణమును జ్ఞానమును జీవధర్మ మనిమీరు వ్యవహరించు చున్నారనియు, వస్తుసంయోగము శిథిలమయి నప్పుడు వృద్ధిగలుగక జ్ఞానము లేకపోవుటయే మరణముగాని యీదేహమును విడిచి జీవునకు గర్మాను గుణంబుగ వేరే దేహము వచ్చుచున్నదని చెప్పెడిమాటయే ప్రత్యక్షవిరుద్ధమైయుండఁగ బూర్వజన్మకర్మఫలము నీశ్వరుఁడుండియిచ్చుచున్నాఁడనుట యబద్ధమని బౌద్ధులుచెప్పుచున్నారు. ఆపక్షమందు బూర్వజన్మ కర్మాను గుణమయిన ప్రారబ్ధ ప్రకారము భాగ్యదారిద్ర్యంబులను రోగమరణాదులననుభవించుచున్నారనుటకవ కాశములేదుగదా ! అట్లయిన నందఱును స్వప్రయత్నముచేత నేభాగ్య వంతులుగ రోగముల కవకాశము లేకుండ నొకవేళ గలిగి నప్పటికిని

దగినయౌషధసేవచేత రోగపరిహారముజేసికొని యారోగ్యముగ నెల్లప్పుడును బ్రతికియుండవచ్చును. ఒకవేళ తెలివిలేనివారికి దారిద్ర్యరోగమరణాదులువచ్చినను, జక్రవర్తులయినవారు మహాబుద్ధిమంతులయిన మంత్రులనువైద్యులను దగ్గరనుంచుకొని తమకు దారిద్ర్యరోగ మరణాదులురాకుండునట్లు చేసికొని యరోగ దృఢగాత్రులై యెల్లప్పుడును బ్రతికియుండవచ్చును. అట్లులేక వివిధప్రారబ్ధ సూచకములయినరోగదారిద్ర్య మరణాదుల నెటువంటివారును, ననుభవించుచుండగఁబూర్వజన్మములును గర్మజన్యమయిన ప్రారబ్ధముచేతనముగనుక తత్తత్కాలానుగుణముగ బ్రారబ్ధఫలంబులును, మనుష్యాదుల కనుభవింపఁజేయుటకునీశ్వరునిననుమాన ప్రమాణములచేత నవశ్యమునొప్పవలయునది. అటుగాక, జన్మాంతరంబు నీశ్వరుండునులేని పక్షమందయినను గలవనెడువాడుపాపభీతిచేత లోకమునకు ద్రోహముజేయడుగనుక నిహమందయినను వానికి బాధకములేదు. నాస్తికుఁడు పాప భయములేక, యక్రమములు సేయుచున్నాఁడు, గనుక నీలోకమందు వీనికి బాధకము గలుగుటయేగాకుండ నీశ్వరుడున్నపక్షమందుఁ బరమందునుబాధకము గలదు.

## కర్మకారణత్వ వాదఖండనము.

మరికొందఱు జీవులకర్మమే జగంబునకును దత్కార్యములైన వర్షాదులకును గారణమనిచెప్పుచున్నారు. అదియునుయుక్తముగాదు. ఎందువలననంటేని? యచేతనమయి క్షణ భంగురమయిన కర్మము సంకల్పసాధ్యములై కాలాంతరభావులయిన కార్యములకు గారణము గానేరదు.

అయితే, కర్మము కారణముగాకపోనిమ్ము, కర్మజన్యమయిన పుణ్యపాపరూపమయిన యదృష్టము ఫలోత్పత్తి పర్యంతముండు నది

యైనందున నదృష్టము కారణముగా వచ్చునేయనియంటేని! యదృష్ట మచేతనమయినందున దానికి ఫలప్రదానసంకల్పాదులు లేవుగనుక నది యును స్వతంత్రకారణముగానేరదు. ఇక నెంతమాత్రముపయోగించు చున్నదంటేని? యీజీవకర్మజన్యమయిన యదృష్టము జీవులకుస్థూల దేహంబులను సుఖదుఃఖంబుల నీశ్వరుడిచ్చుటకు సహకారికారణము మాత్రమగుచున్నది. ఇట్లులేక జగంబునకు సాక్షాత్కర్మమేకా రణ మయ్యెడిపక్షమందయినను తానుజేసెడి భగవద్భజనరూపసత్క ర్మమేతనకు మోక్షము నిచ్చుచున్నది. మఱికొందఱు శుష్కాద్వైతుల ర్థక్రియాకారియైనప్రపంచము వర్తమానకాలమందు లేదనియుఁజిత్తు కుజీవరూపమయినబంధమోక్షంబులే లేవనియుఁదుదకు నేప్రయోజనము లేనియొక చిత్తుమాత్రము గలదనియుఁ జెప్పుచున్నారు. అందుకర్థ క్రియాకారియై యింద్రియగోచరమగుచునుండెడి ప్రపంచమే లేదని చెప్పునప్పు డతీంద్రియమయి బుద్ధిగోచరముగాని యొకచిత్తుమాత్రము గలదనియెట్లుచెప్పవచ్చును, గనుక బ్రహ్మము లేదనియెడు నాస్తికుల కన్నను గలద నెడు నొకమాటమాత్రము జెప్పినవారగుచున్నారు గావున వీరికి బంధమోక్షసద్భావమందు బాధకముగలదు. మఱియును క్షణిక వాదులు ప్రపంచము ప్రతిక్షణములోఁబుట్టుచునశించుచునుంటున్నదని యు నందు వల్లనే పదార్థములకు వృద్ధిక్షయములు కనిపించుచున్న వనియు నివి మొదలయిన యుక్తులు చెప్పుచున్నారు. అవిసరికాదేల నంటేని, చేతనాచేతన స్వభావముల వల్ల ఆపదార్థములకే వృద్ధి క్షయములుగలుగుచున్నవి. ఏపదార్థములనైనా వాటివాటియర్థ క్రియలనుబట్టి స్వరూపనిరూపణము చేయవలసినదే గాని యిందుకు విరోధముగా నిర్ణయింపఁ గూడదు. అందువలన నీశ్వరుడున్నాడని దృఢముగానమ్మి నిషిద్ధకర్మములయందు బుద్ధినుంచక భగవత్ప్రీతికర ములగు కార్యములను జేసి యా భగవంతుని వలన గలిగిన బంధము

నాయన దయచేతనే పాపికొనవలయునది.

### భగవంతునిముఖ్యోపాసనలు.

ఇందుకుపాయము జ్ఞానభక్తికర్మములచేత గ్రమక్రమముగ నొకడుగానును, వేరుగానును, బహు ప్రకారములు గాను, నుపాసన జేయవచ్చును. ఇందుకు బ్రమాణము, గీతాశాస్త్రములో నవమాధ్యాయమందు. (శ్లో॥ జ్ఞానయజ్ఞేనచాప్యన్యేయజంతోమాముపాసతే। ఏకత్వేనపృథక్త్వేన బహుధావిశ్వతోముఖం॥) అనియున్నది గనుక తత్వజ్ఞానముగలవారిలో గొందఱు సృష్టికిఁబూర్వముబ్రహ్మమొకడేయున్నందున నాత్మైక్య బుద్ధిచేత, గీతాశాస్త్రములో సప్తమాధ్యాయమందు. (శ్లో॥ బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్మాంప్రపద్యతే। వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః॥) అనిచెప్పియున్న ప్రకారము ఏకముగాను, నాబ్రహ్మమే సృష్టియందు చిదచిదీశ్వర స్వరూపముగ నగుచున్నాడు గనుక గొందఱుజీవేశ్వరభేదమునుబట్టి దాస్యదాసకభావనచేతఁ బృథక్కుగాను, చిదచిదీశ్వరులు బ్రహ్మ పరిణామములే గనుక, నీసర్వస్వరూపంబులు, బ్రహ్మ స్వరూపంబు లనెడి బుద్ధిచేత గొందఱు బహుప్రకారములుగాను నుపాసన జేయుచున్నారు. ఎందువలననంటేని; తానువిశ్వతోముఖుడుగనుక యెటుల నుపాసించినను దన్నె చెందుచున్నదనిగీతాచార్యులవారికిఁ దాత్పర్యము. గనుక విగ్రహతరుపాషాణాదులనున్నభగవద్విభూతినిబట్టి యర్చింపవచ్చును.

### విగ్రహారాధనచేభగవత్ప్రీతిగల్గుననుట.

అయితే, మనచేత జేయంబడిన యచేతనములయిన విగ్రహాదులను భగవద్బుద్ధిచేత నర్చించుట యత్యంతాన్యాయముగా నున్నదే యనియంటేని, భగవంతుడతీంద్రియుండును సర్వవ్యాపకుండు నని

దేశ్యుండు నచింత్యుండు నవ్యక్తుండునై నందున నిట్టిభగవద్విషయిక నిరాలంబోపాసన జేయుటది మనుష్యునకుఁ గష్టసాధ్యము. ఇందుకు ప్రమాణము, గీతాశాస్త్రము ద్వాదశాధ్యాయములో. (శ్లో॥ క్లేశోధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసాం। అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥) అనిచెప్పఁబడి యున్నది, మఱియు, సాలంబనోపాసన యును, భగవదవతారరూపములను ధ్యానించుటయే కావునఁ జిత్తాలంబన సౌకర్యార్థంబు గను, భగవత్ప్రీత్యర్థంబుగను నాభగవదూపముల రీతిని దారు లోహ పాషాణాదుల చేత విగ్రహాదులను నిర్మించి మంత్రములచేత భగవ ద్విభూత్యతిశయమును గలుగ జేసి పూజాదులు సేయవచ్చును.

అయితే, తెలివిలేని కొందఱు వేదములలో విగ్రహార్చనము జెప్పఁబడియుండ లేదని చెప్పుచున్నారు. అది యుక్తంబు గాదు. ఇందుకు వేదములలోనే ప్రమాణము, సామవేదములో నద్భుతశాంతి ప్రకరణములో, దేవాయతనములయొక్కయు దైవత ప్రతిమాదులయొక్కయు ప్రస్తాపము జెప్పియున్నది. మఱియు ఋగ్వేదము ఖిల సంహిత యందు నారాయణ సూక్తములో నెచ్చట గంగాయమునలుండి యెచ్చటసరస్వతి ప్రాఙ్ముఖగానున్నదో యెచ్చట విశ్వేశ్వరుడునివసించియున్నాడో యచ్చట నన్ను మోక్షమునుబొందించుమనియు, నెచ్చటదేవుడయిన జగన్నాథుడు దక్షిణ సముద్రతీరమందు బలభద్రసుభద్రలతో గూడియున్నాడో యచ్చ టమోక్షమును బొందించు మని చెప్పినచోట కాశీ విశ్వేశ్వర జగన్నాథుల ప్రస్తావమున్నది గనుక విగ్రహార్చనముసేయవచ్చును. ఇందువలన హృదయములో సాలంబనోపాసన సేయుటకు దార్ఢ్య సంపాదనమే గాక, యీవిగ్రహార్చనమువలన భగవత్ప్రీతియును గలుగుచున్నది. ఎందువలననంటేని, భగవంతుడు సర్వవ్యాపకుండును సర్వాంతర్యామియునై ఫలప్రదాత యును, సర్వ

స్వరూపుడు నయినందున క్రమంబుగ నా విగ్రహమున్న స్థలమునందును విగ్రహమందును, విగ్రహస్వరూపముగ నుండెడివాడు భగవంతుడే, గనుక జనులచేత జేయబడెడి విగ్రహార్చనమాయననే చెందుచున్నది. యెగువ జెప్పిన హేతువులచేత నన్నియును భగవత్స్వరూపంబులే గదా, యన్నిటినిబూజించుచున్నారాయని యంటేని, ప్రపంచమంతయు భగవత్స్వరూపంబేయని చెప్పుట కేవిధమయిన సందేహములేదు.

అయితే, సర్వప్రపంచము భగవత్స్వరూపంబేయని పూజించుటకు విశ్వాసము చక్కగగల్గదు, గాబట్టి యట్టివిశ్వాస దార్ఢ్యార్థమయి స్వయంవ్యక్త సాలగ్రామలింగములయందును, విభూత్యతిశయముగల మనుష్యపశు పక్షి వృక్ష పాషాణాదులయందును, మంత్రములచేత భగవద్విభూత్యతిశయము గలుగజేయబడిన విగ్రహాదులయందును, భగవద్విభూత్యతిశయమునుబట్టి యర్చించుటవలన భగవంతునకు వీనియందధికమయిన ప్రీతిగలిగి యిష్టఫలములనిచ్చుచున్నాడు. సాలగ్రామాదులయందు విభూత్యతిశయ మెటువంటిదంటేని! లోకమందు మనుష్యులలో బుద్ధిమంతులయిన వారియందును, శమదమాది సత్వాది గుణవంతులయందును, నితరులకన్న భగవద్విభూత్యతిశయ మెట్లునిర్ణయింప దగియున్నదో, పశు పక్షి వృక్షాదుల యందును వాటివాటికి గలిగియుండెడి జ్ఞానాధిక్యగుణాధిక్యములనుబట్టి భగవద్విభూత్యతిశయమెట్లు నిర్ణయింప దగియున్నదో, యారీతిననే పాషాణములలో సాలగ్రామ లింగముల యందును, శాస్త్రముచేత విభూత్యతిశయము నిర్ణయింపదగియున్నది.

అయితే, మనచేతజేయంబడిన విగ్రహము, మనముభక్తిచేత జెప్పెడు మంత్రముల వలన భగవద్విభూత్యతిశయముగలిగి ఫలముల నెట్లిచ్చుచున్నదంటేని, మనకుఁబుట్టి మనచేత బోషింపబడిన బిడ్డడు

మనముచెప్పిన చదువువలనబుద్ధిగలిగి మనకుంబోషకుడెట్లగుచున్నాడో, యదే రీతిన మనచేతఁ జేయబడిన విగ్రహాదుల యందును మంత్ర ముల చేత గలిగినవిభూత్యతి శయము ఫలముల నిచ్చుచున్న దని చెప్పెడు శాస్త్రమే ప్రమాణము.

## ఒకడయ్యీభగవంతుడుసర్వవ్యాపకుడనుట

అయితే, భగవంతుడు సర్వవ్యాపకుడని పైనజెప్పబడియున్న దే యేకమయినబ్రహ్మము సర్వప్రపంచము నెట్లువ్యాపించుచున్నాడం టేని! యేకమయిన యాకాశ మంతట నెట్లు వ్యాప్తమై యున్నదో యట్లేక మయిన బ్రహ్మమంతట వ్యాపించి యున్నాడు.

అయితే, భగవంతుడు సర్వాంతర్యామియని పయిన జెప్పబడి యున్న దే, కఠినమయి లోపలనిరవకాశమయిన కొన్నింటియం దెట్లంత ర్యామిగ నున్నాడంటేని ! యవకాశములేని వృక్షమందంతటను వృద్ధిని జేసెడు చైతన్య మంత ర్యామిగ నెట్లున్నదో, యారీతిని గఠినమయిన వాట్లయం దంత ర్యామిగ భగవంతు డుంటున్నాడు. అది యుక్తమే, యవ్యక్తుడయి నిత్యుడయిన బ్రహ్మము వ్యక్తమై యనిత్య మయిన యీ సర్వప్రపంచ స్వరూపుడగు టెట్లంటేని, యవ్యక్తుడై నిత్యుడయినబ్రహ్మ మందు వ్యక్తములై యనిత్యములయినజగద్రూపపరిణామములు కారణా వస్థలో లేకపోయినను, నవ్యక్తుడై నిత్యుడయిన బ్రహ్మము సత్యజ్ఞానా నందసర్వశక్తి స్వరూపుడు గనుక వ్యక్తమైయనిత్యమయిన జగద్రూపంబు గఁదానే పరిణమించుచున్నాడు. ఇందుకు దృష్టాంతము. కారణమయిన మృత్తుయందు గార్యములయిన ఘటశరావాది రూపములు లేకపోయి నను, గారణమయిన మృత్తికయే యన్వయవ్యతిరేకములచేత గార్యము లయిన ఘటశరావాది రూపములుగ నెట్లగుచున్నదో యట్లుసర్వప్రపం

చస్వరూపముగ బ్రహ్మమే యగుచున్నాడు.

అయితే, వ్యక్తమయిన మృత్పిండము వ్యక్తమైయున ఘటశరావాదులుగబరిణమింపవచ్చుంగాని, యవ్యక్తమైన బ్రహ్మము వ్యక్తమైన ప్రపంచముగనెట్లుపరిణమింపవచ్చునంటేని, ఒకవస్తువే, వ్యక్తావ్యక్తములుగఁబరిణమించుచున్నది యిందుకుదృష్టాంతము, పురుషునియొక్క కలిలముగనుండెడివీర్యమే జీవుడుమనోబుద్ధ్యాదులు జ్ఞానేంద్రియములు, నవ్యక్తమైనవిగానునుజీవునియొక్క జ్ఞానవ్యాప్తిగలిగినశరీరము, కర్మేంద్రియములు, జ్ఞానవ్యాప్తి లేనినఖకేశములు వ్యక్తములైనవిగాను నిట్లు పరిణమించుట, యెటుల దాని స్వభావమో, అటులనే యవ్యక్తుడై నిత్యుడైన బ్రహ్మము సత్యజ్ఞానానంద సర్వశక్తి స్వరూపుడేగనుక తానే సంకల్పించిజీవ ప్రాణేంద్రియములుగా వ్యక్తమైన యీప్రపంచముగ బరిణమించుటది బ్రహ్మస్వరూప స్వభావమేను,

⟶ సర్వదేవతారూపుడై భగవంతుడే యాఫలముల నిచ్చుచున్నాడనుట. ⟵

అయితే, సర్వప్రపంచస్వరూపముగఁదానయ్యు, నుపాధిభేదములను బట్టి, కానియట్లుదోచుచున్నాడు గావున గీతలలో (సదసచ్చాహమర్జున,) అనిచెప్ప బడియుండెడి ప్రకారము చిజ్జడాత్మక ప్రపంచస్వరూపుడును, కృష్ణాష్టోత్తర శతములో, జెప్పబడి యుండెడి ప్రకారము సర్వతీర్థస్వరూపుడునుసర్వగ్రహస్వరూపుడును, (పుష్ణామిచౌషధీస్సర్వాస్సోమోభూత్వా రసాత్మకః,) అనెడుగీతావచన ప్రకారము సర్వదేవతా స్వరూపుడును, సర్వఫలప్రదాతయైను భగవంతుండే గావున కామ్యాదుల యందైన నితర దేవతల నుపాసించునప్పుడు భగవంతుండే యీరూపము చేత ఫలము నిచ్చుచున్నాడని యుపాసన జేయువలయునే గాని, యన్యోపాసనచే యుద్దిష్ట

ఫలము నిచ్చుచున్నారని యుపాసన జేయగూడదు. ఎందువలన నంటేని, దేవతలు కార్యకోటిలో జేరి పరిచ్ఛిన్నజ్ఞాన శక్తులుగలవారు గనుక, నింద్రాది దేవతలలో నొకని నుద్దేశించి యనేకు లనేక స్థలములలో నేకకాలమందు నానావిధఫలోద్దేశముచేత నుపాసన సేయునప్పుడు, వారివారియుద్దేశములను దెలిసికొనుటకుగాని, యుపాసనానురూపము లయిన ఫలముల నిచ్చుటకు గాని శక్తులు గారు. భగవంతుండు గీతాశాస్త్రములో త్రయోదశాధ్యాయమందు. (శ్లో॥సర్వతః పాణిపాదం తత్సర్వతోక్షిశిరోముఖం । సర్వతశ్శృతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి॥) అనిచెప్పియున్న ప్రకారము జ్ఞానకర్మేంద్రియాది సర్వశక్తులతో సర్వసాక్షియై దేశకాలపరిచ్ఛేదములు లేకుండ వ్యాపించియుండెడు వాడుగనుక, పైనజెప్పినప్రకారము నానాదేశములయందు నానా ఫలోద్దేశముగనుపాసన సేయువారి యుద్దేశప్రకార మాయాదేవతలస్వరూపముగ దానే యుపాసనాను రూపఫలముల నిచ్చుచున్నాడు. ఇందుకు బ్రమాణము, భగవద్గీతా శాస్త్రములో సప్తమాధ్యాయమందు. (శ్లో॥ యోయోయాంయాం తనుంభక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి । తస్యతస్యాచలాంశ్రద్ధాం తామేవవిదధామ్యహం।సతయాశ్రద్ధయాయుక్తస్తస్యారాధనమీహతే। లభతేచతతఃకామాన్మయైవ విహితాన్హితాన్ । అంతవత్తుఫలంతేషాం తద్భవత్యల్పమేధసాం। దేవాన్దేవయజోయాంతి మద్భక్తాయాంతిమామపి॥) అనియు,బంచదశాధ్యాయమందు. (శ్లో॥ గామావిశ్యచ భూతాని ధారయామ్యహమోజసా । పుష్ణామిచౌషధీస్సర్వా స్సోమోభూత్వా రసాత్మకః। అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాందేహమాశ్రితః। ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నంచతుర్విధం॥) అనియిట్లు భగవంతుండే యాయాదేవతా స్వరూపుడునై యాయా ఫలంబుల నిచ్చుచున్నా నని చెప్పియున్నాడు గనుక, నిత్యనైమిత్తిక కామ్యాదుల

యందుఁ విధ్యుక్తదేవతలను పాసించునప్పు డన్యోన్యదేవతయే యాఫలము నిచ్చుచున్నదని యెంచక భగవంతుడే యాదేవతా స్వరూపంబుగ నా ఫలము నిచ్చుచున్నాడని నమ్మవలయునది.

అయితే, యాయాఫలోద్దేశముచేత నన్యదేవతోపాసనలను జేయుమని విధించిన భగవంతుండన్య్యోపాసనానుగుణఫలప్ర దానశక్తిని నా దేవతకే యిచ్చియుండును గనుక, నుపాసించువాఁడా దేవతనుద్దేశింపక భగవంతునినుద్దేశించెనేని యా దేవత,కతృప్తిగలిగి యట్టిఫలమునీయక పోవునేయని యంటేని, యుద్దేశ్యదేవతలకే ఫల ప్రదానశక్తిని భగవంతుడు గలుగజేసియుండినను దత్తద్దేవతా స్వ రూపంబుగ భగవంతుండే ఫలప్రదాతయని యుద్దేశించుట వలన, నన్యదేవతలకు దృప్తియే గలుగుంగాని యతృప్తిగలుగదు. ఇందుకు ప్రమాణము. శ్రీభాగవత మష్టమ స్కంధములో సప్తమాధ్యాయమం దు, (శ్లో॥ పుంసఃకృపయతో భద్రే సర్వాత్మాప్రీయతేహరిః। ప్రీతే హరౌ భగవతి ప్రీయేహంసచరాచరం॥) అని చెప్పబడియున్నది. మఱియు లోకములో ఫలార్థమయి వృక్షమూలమందు జేయబడెడు జలసేక మావృక్ష పరిణామములయిన శాఖాపత్రపుష్పాదులయందు వ్యాపించి ఫలములను గలుగ జేయుచున్నరీతిని దత్తద్దేవతాస్వరూపంబుగ భగ వంతుని నుద్దేశించి చేయ బడెడు నుపాసనాదులు, భగవత్పరిణామ భూతులైయుద్దేశ్య నామరూపములుగల యన్యదేవతలకు దృప్తిని గలుగజేయుటకు సందేహము లేదు. ఇట్లుగాక యన్యదేవతనేయు ద్దేశించెనేని, యన్యదేవతకు గాని, భగవంతునికిగాని విశేషతృప్తి గలుగనేరదు. అదియెట్లంటేని; యొక మనుష్యుని దేహైకదేశమయిన యవయవము యొక్క యారోగ్యము కొఱకు దేహాధారభూతమయిన గర్భములోని కౌషధము బుచ్చుకొనుటవలన నయ్యావయవమున కారో గ్యముగలిగిన ట్లాయవయవ మందు సాక్షాత్తుగా నౌషధసేవ సేయుట

వలన నాయవయవ మునకుగాని యాదేహమునకు గాని యట్టియారో గ్యముగలుగనేరదు గదా ! కాబట్టి యుపాస్యదేవతా స్వరూపుడుగ భగవంతుండే ఫలముల నిచ్చుచున్నాడన్ని నమ్ముటయే భగవంతునకు నన్యోదేవతలకు నత్యంత తృప్తికరమగుచున్నది. అలాగున నమ్మినవా రాయాఫలములనుబొంది మిగులనీశ్వరప్రీతికిఁ బాత్రములగుచున్నారు.

## సర్వజనంబులు నుపాసింపదగినమార్గము.

అట్లునమ్మకయన్యోదేవతలనే నమ్మియుపాసించువారా భగవంతుని చేతనే యంతవత్తములయిన ఫలములను బొందుచున్నారు. గనుకనే దేశస్థులయిన నేవర్ణస్థులయిన నేకులస్థులయిన నేమతస్థులయిన నెంత కష్టమయినప్పటికిని స్వకులమత ధర్మాచరణము సేయుచు సత్యాదులు దప్పక యేనామముతో నెటువంటి రూపము నుద్దేశించి యైనను నితడే జగత్కారణ మనెడి భగవద్బుద్ధితో నుపాసించెదు వారల నట్టిజగ త్కారణ మైనభగవంతుండే రక్షించుచున్నాడు, ఎందువలననంటేని, మనుష్యులుకించిజ్ఞులగుట చేతబొరబాటుపడి నామరూపములను వేరు వేరుగ నుద్దేశించినను, నధర్వశిఖోపని షత్తులోగారణముధ్యానము సే యదగిన దని చెప్పఁబడియున్న ప్రకార మానామరూపముల యందు జగత్కారణత్వారోపము సేయుచున్నాడుగనుక, యాకారణమయిన దేవుడు సర్వజ్ఞుడగుట వలన బొరబాటు పడక వారలను రక్షించు చున్నాడు. ఇందుకుదృష్టాంతము, గజేంద్రుం డేపేరుబెట్టక కారణం కారణమని మొరబెట్టుకొన్నందున నాగజేంద్రుని భగవంతుడురక్షిం పలేదా ! కాబట్టి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, శక్తి, సూర్యుడు, గణపతి, అగ్ని, యింద్రుడు, మొదలయినయనేకరూపములనుగారణ మయిన పరబ్రహ్మమనుబుద్ధితో నుపాసించెడివారినందఱిని, సర్వస్వ రూపుడును, సర్వకారణకారణమునయిన యాపరబ్రహ్మమే రక్షించు

చున్నాడు. ఇందుకుఁబ్రమాణము, మనుస్మృతిద్వాదశా ధ్యాయాంత ములో. (శ్లో॥ ప్రశాసితారంసర్వేషామణీయాంసమణోరపి । రుక్మా భంస్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషంపరం । ఏత మేకేవదంత్యగ్నిం మనుమన్యేప్రజాపతిం । ఇంద్రమన్యేపరేప్రాణ మపరే బ్రహ్మశాశ్వ తం । ఏషసర్వాణిభూతానిపంచభిర్వ్యాప్యమూర్తిభిః । జన్మవృద్ధి క్షయైర్నిత్యంసంసారయతిచక్రవత్ । ఏవంయస్సర్వభూతేషు పశ్య త్యాత్మానమాత్మనా । ససర్వసమతా మేత్యబ్రహ్మాభ్యేతిపరంపదం॥) అనిచెప్పబడియున్నది. గనుకనెటువంటివారైనను స్వధర్మాచరణము సేయుచుఁగారణమనెడి బుద్ధితో, నేనామరూపముల నుపాసించినను, నాకారణమయిన పరబ్రహ్మము నేచెందుచున్నది.

## పరధర్మముకంటె స్వధర్మముశ్రేష్ఠమనుట.

అయితే, స్వధర్మము కన్న నన్యధర్మము సులభ మయినది గాను, నహింసారూపమయినదిగానున్నయెడల నేలయంగీకరింపగూడ దంటేని, యన్యోన్యకులస్థులలో నన్యోన్య మతస్థులలోఁదన్ను భగవంతుడు పుట్టించినందువలనను, శాస్త్రోక్తత త్తత్కుల మతాచార కర్మములకు భగవంతుండే ఫలప్రదాతగనుకనుభగవంతునినమ్మి వారివారి శాస్త్రో క్తకర్మములుసేయుటవలన భగవత్ప్రీతిగలుగుటకుసందేహము లేదు. ఇందుకుబ్రమాణము, గీతాశాస్త్రము షోడశాధ్యాయమందు. (శ్లో॥ తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతేకార్యాకార్యవ్యవస్థితౌ । జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తంకర్మకర్తుమిహార్హసి॥) అనిచెప్పబడియున్నది. అటు గాకయన్యోన్య శాస్త్రములలో వ్యత్యాస మున్నయెడల దత్ప్రయుక్త లోపము లాశాస్త్ర కర్తలకే దోషావహ మగునుగాని, దానినమ్మి యాచరించువారికి దోషావహముగానేరదు, గనుక స్వధర్మాచరణ మేశ్రేష్ఠము. ఇందుకుఁ బ్రమాణము, గీతా శాస్త్రములో దృతీయా

ధ్యాయమందు. (శ్లో ॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ । స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥) అనియున్నది.

అయితే, పూర్వోక్తసత్యాదు లెవ్వియంటే.

## సర్వమతసాధారణధర్మములు.

అన్యాయముగ నబద్ధము జెప్పక యుండుట.

అన్యాయముగ స్థిరచరరూపమయిన పరులసొమ్మునప
హరింపక యుండుట.

అన్యాయంబుగఁబరులకు శ్రమముగలుగజేయకుండుట.

అన్యాయముగ స్త్రీని బలాత్కరించి పట్టకయుండుట.

అన్యాయముగ నరహత్యసేయక యుండుట.

తన జన్మమునకు గారణమయిన తల్లిదండ్రులయందు
న్యాయముగ భక్తినుంచుట.

అన్నదాతయైనవాని న్యాయముగజెప్పినపనిసేయుట:

తనకు గలిగిన మట్టుకు నొకనికి న్యాయముగ నన్నప్ర
దానముసేయుట.

పెద్దలను న్యాయముగ దూషింపక యుండుట.

న్యాయముగ గురువునందు భక్తినుంచుట.

అధర్మప్రవర్తకమై యొడలుమఱచునట్లు కైపుసేయ
కుండుట.

తనకు విరోధులుగాని వారియందు భ్రాతృభావ ముం
చుట.

ఇవి మొదలయినవి సర్వులమత సాధారణము లయిన సత్యాదులు. ఇటువంటి సత్యాదులను దప్పకుండ స్వకుల మతధర్మముల ననుసరించి

భగవదుపాసన సేయు వారిని స్వకులమత ధర్మముల యం దెవ్వి ధైన
నను లోపములున్న యెడల వాటిని క్షమించి భగవంతుడు రక్షించు
చున్నాడని చెప్పవలయునది. ఎందువలననంటేని ? యచింత్య శ క్తి
గల భగవంతునితత్వముల నెంతనిష్కర్షగ శోధించినను జీవులుకించి
జ్ఞులగుటచేత వా స్తవమును దెలిసికొనజాలరు. గనుకనునీశ్వరతత్వము
లేకరీతిగ నుండునుగాని నానావిధంబులుగనుండవు గనుకను బరస్పర
విరుద్ధములై నానావిధంబులయినతత్వంబులను నిర్ణయించిశాస్త్రంబు
లను జేయువారందఱును దరుచుగకొన్ని విషయములలో వేరుగా దెలసి
కొనిచేసెదు వారలేగాని వేరేకాదు అయిననిట్టి శాస్త్రక ర్తల నాయా
శాస్త్ర ప్రకారముగ గారణబుద్ధిచేత నుపాసనసెయువారలనుభగవం
తుడుతన్ను గుఱించి యింత కష్టపడుచున్నా రనెడిదయతోనందు లోని
లోపములను మన్నించి రక్షించుచున్నాడు. ఇందునానామతస్థు లైన
పెద్దల శాపాను గ్రహవాక్యములను భగవంతుడు సార్థకము జేసినది
యే,దృఢమైన ప్రమాణమైయున్నది, గనుక సేశ్వరమతములన్నియు
నుపా శేయంబులై యున్నవి.

## అధమజాతులకును మోక్షముగలదనుట.

అయితే, యుత్తమజాతులకే మోక్షము వచ్చుంగాని యితర
జాతులకు మోక్షము రాదని కొందరు చెప్పుచున్నారు. అదిసరియై
నది గాదెందువలననంటేన్ని, యుదకమందెటువంటి వారుస్నానముజేసి
నప్పటికిని దేహమాలిన్య మెట్లు నివర్తించు చున్నదో, యాలాగు ననే
భగవంతుని నమ్మిన సకల ప్రాణులకు పాపము నివర్తించి మోక్షము
సిద్ధించుచున్నది. ఇందుకు బ్రమాణము, గీతాశాస్త్రములో నవమా
ధ్యాయమందు ( శ్లో.॥ మాంహిపార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుఃపాప
యోనయః । స్త్రియోవైశ్యా స్తథాశూద్రాస్తేపియాంతిపరాంగతిం॥)

అనిచెప్పబడి యున్నది, గనుక సర్వజాతుల వారికి మోక్షముగలుగు చున్నది.

అయితే, యశాస్త్రీయములుగను నన్యాయములుగను లోకదూష్యములుగనుండెడు నాచారము లంధపరంపరచేతఁ దనకువచ్చిన వెుడలనయినా వాటిని స్వబుద్ధిచేత నివర్తించుకొని శాస్త్రీయస్వధర్మములను విడువక భగవంతుని నుపాసించువారి నాయన రక్షించుచున్నాడు.

అయితే, యిప్పటి జను లల్పమయిన బలబుద్ధ్యాయుష్యములుగలవారయినందున నన్నగతప్రాణులయినందునను, శమదమాదిగుణములు లేనివారయి నందునను, వీరలకుఁ గ్రింద నేనుజెప్ప బోయెడు నుపాసనలుదక్క వాయుధారణాదియోగములుగాని యితరములైన యేయుపాసనలుగాని సిద్ధింపవు, ఎందువలననంటేని, ఏకత్వముచేత జేసెడు నుపాసనారూపమయిన జ్ఞానయోగము నిర్వికల్పక సమాధివలన సిద్ధించుచున్నది, యాసమాధివాయుధారణాది యోగశక్తిచేత మనో నిగ్రహద్వారముగా గలుగవలసినది. భిన్నత్వముచేత జేసెడు నుపాసనారూపమయిన భక్తియోగమును, తైలధారవలె నవిచ్ఛిన్నమయిన సాలంబనస్మృతిసంతానము గనుక నాలాగున మనసు నిలుచుటయును వాయు ధారణాది యోగశక్తిచేత మనో నిగ్రహ ద్వారముగ సిద్ధింపవలసినది. నానావిధంబులుగ జేసెడు భగవదుపాసనారూపకర్మయోగమందును క్రియాబాహుళ్యమువలన నతిశ్రమంబును, మంత్రతంత్ర ద్రవ్యక్రియాది లోపములవలన బ్రత్యవాయంబును గలుగుచున్నది. గనుక నిదియు నిప్పటివారికి సాధ్యముగా నేరదు, మఱియును భగవంతుడుసర్వస్వరూపుడు గనుకనాయనను నానావిధ రూపంబులు గనుద్దేశించిచేయు నుపాసనలనగా, దహరవిద్యయు నక్షివిద్యయు మధువిద్యయు వైశ్వానరవిద్యయు నుపకోసలవిద్యయు శాండిల్యవిద్యయునాద

ము, లక్ష్యము. నివి మొదలైన విద్యలును పైనజెప్పిన విద్యలును వీటి లోనంతయు గ్రియాబహుళ మైనకర్మయోగము దక్క-కడమ విద్యలు కొన్నివాయు ధారణాది యోగసిద్ధిచేతను కొన్నిచిరకాలాభ్యాసము చేత నాయాస మాధులయందు మనసుచలింప కుండునట్లు కొండొక సేపునిలిచినను గానిమనోలయ ద్వారముగాస్వరూపానందా విర్భా వముగలిగి మోక్షము సిద్ధింపనేరదు, గనుక నవియునిప్పటి వారికిసాధ్య ములుగావు ఇంతియేగాక, సర్వసన్యాసముజేసి మోక్షమును బొంద రాదా యని యంటేని, భగవంతుడు తనలీలారూప ప్రపంచవృద్ధి కొఱకు స్త్రీపుంవ్యక్తులను, నింద్రియవిషయాదులను గామమును సృ జించి జీవులకు విషయాను భవములయందువిశేషానందమును గలుగ జేసి పరస్పర సంబంధ ద్వారముగా భూతకోట్లను సృష్టిజేయుచు న్నాడు. మఱియు మనుష్యులు కామాదులచేతజేయుసుకృత దుష్కృ తములను బట్టి తత్తదను రూపము లయిన జన్మాంతరములనిచ్చి సుఖ దుఃఖరూప ఫలముల ననుభవింప జేయుచు నిట్లుప్రపంచలీలాభివృద్ధిని జేయుచుండు నప్పుడా భగవంతుని యొక్క సంకల్పమునకు విరోధ ముగా నప్రత్యక్షమయిన మోక్షముకొఱకు బ్రత్యక్షానందకరమయిన విషయానుభవమును వదలుట మనుష్యునకు గష్టతరమయినది, యెటు వంటివారి మానసమునైనను విషయాదుల యందు నింద్రియాదులుబలా త్కారంబుగ నాకర్షింపకమానవు, ఇందుకు బ్రమాణము గీతాశా స్త్రములో ద్వితీయాధ్యాయమందు (శ్లో॥ యతతోహ్యాపి కౌంతే య పురుషస్యవిపశ్చితః. ఇంద్రియాణిప్రమాథీనిహరంతిప్రసభంమనః.) అనియున్నది. గనుక విషయ నివృత్తి గలుగుటది కష్టసాధ్యము, కాబట్టి గీతలలో సప్తమాధ్యాయమందు (శ్లో॥ ధర్మావిరుద్ధోభూతేషుకా మోస్మి భరతర్షభ, అనిచెప్పబడి యున్నందున, ననిషిద్ధ విషయా ను భవమ్ముజేయందగిన గృహస్థా శ్రమమందేయుండి అష్టాదశాధ్యా యమందు. (శ్లో ॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణోమద్వ్యపా

శ్రయః । మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతంపదమవ్యయం॥ ) అనియు దృతీయాధ్యాయమందు. (శ్లో ॥ కర్మణైవహిసంసిద్ధిమాస్థితాజనకాదయః । లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి॥ ) అనియుఁజెప్పబడీయున్న ప్రకారము భగవంతుని నమ్మి సర్వకర్మములు సేయు వాని యందు, భగవంతునికి దయగలిగి యాముష్మికంబునే యిచ్చుచుండునప్పు డైహిక ఫలముల నిచ్చుటయందు సేసందేహము లేదు. మఱియుఁదన్ను నమ్మిన వారియొక్క యోగక్షేమమును దానే వహించుచున్నానని గీతలలో భగవంతుడే చెప్పియున్నాఁడు. గనుక నా భగవంతుని నిక్కంబుగ నమ్మవలయునది.

భగవంతునినమ్మినందు కనుభావములు.

అట్లు భగవంతుని నిజంబుగ నమ్మినందు కనుభావము లాయన విషయమయి చేయబడెడి మనోవాక్కాయ కష్టములు మూఁడు, నర్థవ్యయం బొక్కటియు నీనాలుగేగాని గీతా శాస్త్రము తృతీయాధ్యాయమందు. (శ్లో॥ కర్మేంద్రియాణిసంయమ్య యఆస్తేమనసాస్మరన్। ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్సఉచ్యతే॥) అనిచెప్పబడియున్న ప్రకారమాంతర నిష్ఠావిహీన మయిన కేవల మిథ్యాచార తత్వప్రలాపము, లనుభావములుగావు గనుకనిట్టి మిథ్యాచారములుగానివియు నిప్పటివారికి బ్రయత్న సాధ్యము లయినవియు లోపాదుల వలన బ్రత్యవాయజనకములు గానివియు నైనవిమానసిక వాచికకాయిక శ్రమార్థ వ్యయరూపములైన యీయుపాసనలు నాలుగు.

మొదటిదిమానసికపూజా ధ్యానాదు లివిమానసికము,
రెండవది నిరంతర భగవన్నామకీర్తన మిదివాచికము.
మూఁడవది స్వోపభోగ్యములైన పదార్థములు మొద
లైన వాటిని భగవదర్పణముజేసి
యనుభవించు టిదికాయికము,

నాల్గవదిశక్త్యను సారంబుగ ననుసంధానము సేయుటిది యర్థవ్యాయము.

## మానసికపూజసర్వసులభమనుట.

బాహ్యపూజయందువలెనే పరిశుద్ధవస్తుసంపాదనశ్రమంబును లోపాదులవలన బ్రత్యవాయంబును లేకయుండుటమానసికపూజయందుండెడిసౌలభ్యము ఈయభిప్రాయము వలన నేస్కాందము ధర్మఖండోత్తర భాగములోన వమాధ్యాయమందు. (శ్లో॥ బాహ్యపూజాసహస్రాణి మహాదానశతానిచ। ధృవంమానసపూజాయాఃకళాంనార్హంతిషోడశీం॥) అనియు హారీతస్మృతిలో. (శ్లో॥ఏవంహృద్యర్చనం విష్ణో రుత్తమంముని సత్తమ అత్యంతాభిమతావిష్ణోః హృత్పూజాపరమాత్మనః అనియునుం జెప్పబడియున్నది.

## నామకీర్తనకునియమాపేక్షలేదనుట.

మంత్రాదుల యందువలేనే కాలదేశాచారాది నియమాపేక్ష లేకయుండుటయు నుచ్చారణసౌకర్యము నామకీర్తన మందుండెడి సౌలభ్యమిందుకు బ్రమాణము బ్రహ్మవైవర్త పురాణములో (శ్లో॥ విహితమఖిలకర్మ బ్రాహ్మణానాం మునీంద్రై ర్విధినియమ సమేతం శక్యతేనైవ కర్తుం। తదఖిలమపిహిత్వాయో మహాదేవశబ్దం పఠతిఫలము శేషం ప్రాప్నుయాత్సోన వద్యం॥) అనియు స్మృతులలో. (శ్లో॥రత్యంతరే మూత్రపురీష యోర్వాచండాల వేశ్మన్యథవాశ్మశానే। కృతప్రయత్నో ప్యకృతప్రయత్నస్సదాస్మరేత్కేశవనామధేయం అనియు అభినవషడశీతి గ్రంథములో (శ్లో॥ దేవతాంతరనామానినా శుచిః పరికీర్తయేత్, నారాయణస్యనామాని సదాసర్వత్రకీర్తయేత్, అనియును జెప్పబడి యున్నది, తానేమి సేయుచున్నాడో యేమనియును భవించు

చున్నాడో యివియన్నియును భగవ దర్పణము జేయుట వలనభగ వంతుడు ప్రీతుడగుచున్నాడు గనుకనిందులోనర్ధ వ్యయాభావ రూపసౌ లభ్యము. ఇందుకుప్రమాణము గీతాశాస్త్రములో నవమాధ్యాయమందు (శ్లో॥ యత్కరోషి యదశ్నాసియజ్జుహోషి దదాసియత్ యత్త పస్యసికౌంతేయ తత్కురుష్వమదర్పణం, అనిచెప్పcబడి యున్నది, ఈమాటికినిగాలదేశ నియమాపేక్షలు లేవు గనుక గురూపదేశముతో నావశ్యకములేదు. ఇదిసర్వజాతిసాధారణము.

## సర్వజాతిసాధారణధర్మమైన యన్నదాన ముత్తమ మనుట.

అన్నదాన విషయములో, స్మృతీ చంద్రికలో వ్యాసవచనము. (శ్లో॥ గ్రాసమప్యేకమన్యస్య యోదదాతిదినేదినే । స్వర్గలోకమవా ప్నోతినరకంచనగచ్ఛతి॥) అనియున్నది యింతియేగాక పాత్రాపాత్ర వివేచనలేకుండ క్షుధితులయినవారికి ధనశక్త్యనుసార మొకకబళమి చ్చినందువలన గలిగెడిప్రాణధారణ పూర్వక మయిన జీవత్స్రప్తిభగ వల్లీలాభి వృద్ధికిహేతువగుచున్నది గనుక నిందుచేతభగవంతుడు విశే షప్రీతుడై వానిపాపములనునశింప జేయుచున్నాడు. ఇదియును సర్వ జాతిసాధారణము.

అయితే, ఉత్తమ జాతీయులకు నర్హ మయిన వారి చేతc జేయించి యిప్పింప వలయును. ఇదియన్న దానములో నుండెడి సౌల భ్యము. ఇందుకుప్రమాణము. స్కాందముధర్మఖండోత్తరభాగము సప్తదశాధ్యాయమందు. (శ్లో॥ అన్నస్యక్షుధితంపాత్రం కాలేచాతిథి రాగతః। క్షుధితంయాచమానంచ కాలేచాతిథిమాగతం । పూజయే ద్భక్తిభావేన భక్తశాకజలాదిభిః। అన్నదానంపాపహరంసర్వసంప త్ప్రిదాయకం । శోకఘ్నందుఃఖహననంసర్వాపద్వినివారణం। అన్న

దఃప్రాణదఃప్రోక్తః అన్నేప్రాణాః ప్రతిష్ఠితాః । ప్రాణినోన్నేనజాయంతేజాతానామపివృద్ధిదం । తస్మాదన్నప్రదాతాహి శివస్యాంశో హరేరపి॥) అనియు, బ్రహ్మవైవర్తపురాణములో శ్రీకృష్ణజన్మఖండములోనేకవింశాధ్యాయమందు. (శ్లో॥ అన్నంచసర్వభూతేభ్యఃపుణ్యార్థందాతుమర్హసి। దత్వావిశిష్టజీవేభ్యో విశిష్టఫలమాప్నుయాత్॥) అనియు శ్రీభాగవతము చతుర్థ స్కంధములో నేకవింశోధ్యాయమందు. (శ్లో॥ అశ్నాత్యనంతఃఖలుతత్వకోవిదైః శ్రద్ధాహుతంయన్ముఖ ఇజ్యనామభిః । నవైతథాచేతనయా బహిష్కృతే హుతాశనేపారమహంస్యపర్యగుః॥) అనియును జెప్పబడియున్నది.

అయితే, పీడుమానసికముగసమర్పించుపదార్థములు కేవలము మనఃకల్పితములాయెను, బాహ్యమందు సమర్పించు పదార్థములిక్కడనేయుండెను. ఈశ్వరుడెట్లుభక్షించి తృప్తుడగుచున్నాడనియంటేని, నిత్యతృప్తుడయిన భగవంతుడు మనముసమర్పించు పదార్థముల వలన మనుష్యునివలెనే తృప్తునివర్తించి ప్రీతుడగుటగాదు.

## ఎట్లయినభగవద్విషయమతిశ్రేయస్కరమనుట.

అయితే, యేవిధంబుగ నయినను భగవద్విషయ మయిన మతి గలుగుటది యాయనకుప్రీతికరమైయుంటున్నది. ఇందుకుప్రమాణము. శ్రీభాగవతమేకాదశ స్కంధములో ద్వాదశాధ్యాయమందు. (శ్లో॥ కేవలేనహిభావేన గోప్యోగావోనగామృగాః । యేన్యేమూఢధియోనాగాః సిద్ధామామీయురంజసా॥) అనియు సప్తమ స్కంధములో ప్రథమాధ్యాయమందు. (శ్లో॥ కామాద్ద్వేషాద్భయాత్స్నేహాద్యథాభక్త్యేశ్వరేమనః । ఆవేశ్యతదఘంహిత్వాబహవస్తద్గతింగతాః॥ గోప్యఃకామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయోనృపాః । సంబంధాద్వృష్ణయస్స్నేహాద్యూయం భక్త్యా వయం నృప॥) అనియు దశమ

సంబంధములో నేకోనత్రింశోధ్యాయమందు. (శ్లో॥ కామంక్రోధంభయం స్నేహ మైక్యంసౌహృదమేవవా । నిత్యంహరౌవిదధతో యాంతితన్మయతాంహితే॥) అనియును జెప్పబడియున్నది, గనుకచైద్యాదులితరభావముచేతనే భగవంతునియందు మతిగలిగి ముక్తులై యుండగనివియుభక్తిరూపభావములకు సాధకము లయియున్నవి. కాబట్టి వీట్లవలన భగవత్ప్రీతి కలుగుటకు గొంతయేమి యున్నది.

## ❁ కలియుగమందుభగవన్నామకీర్తనముఖ్యమనుట ❁

పైనజెప్పిన ప్రకారము సర్వదేశసర్వకాలసర్వావస్థలయందును సర్వజనులకుసులభప్రయత్నసాధ్యములై భగవత్ప్రీతికరములైన నాలుగుపాయములందునుగలిలోముఖ్యమైనదిభగవన్నామకీర్తనము, ఇందుకు ప్రమాణము॥ విష్ణుపురాణములో. (శ్లో॥ ధ్యాయన్ కృతేయజన్యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరే౽ర్చయన్ । యదాప్నోతి తదాప్నోతికలౌసంకీర్త్యకేశవం । అనియు బృహన్నారదీయములో. (శ్లో॥ నమోనారాయణా యేతికీర్తయంతిచయేనరాః । నిష్కామావాసకామావానకలిబాధత్తేహితాన్॥) అనిన్ని, హరేర్నామైవనామైవనామైవ మమజీవనం । కలౌనాస్త్యేవనాస్త్యేవనాస్త్యేవగతిరన్యథా । అనిన్ని యున్నది । యింతేగాక మిక్కిలి సులభ మునైయున్నది. అది యెందువల్లనంటేని, యీనామస్మరణము తెలిసిచేసినను తెలియకజేసినను ఈశ్వరప్రీతిద్వారా సకలపాపములను నశింపజేసి యైహికాముష్మికసకలఫలముల నిచ్చుచున్నది, అదియెట్లంటేని ! భగవన్నామము స్మరించినమాత్రము చేతనేయంతకు మున్నుగావింపంబడిన పాపములన్నియునశించుచున్నవి, మనుష్యుడెప్పుడు నుగాయికవాచికమానసిక రూపత్రివిధ దోషముల జేయక నుండలేడు । గనుకయీనామస్మరణమునకు వెనుకజేసినపాపములు వెంటవెంట జేయునామ స్మరణమువలన నేనశించుచున్నవి.

## ✽ నామాపరాధదశకము. ✽

(శ్లో॥ సన్నిందాసతి నామ వైభవకథా శ్రీశేశయోర్భేదధీ రశ్రద్ధాశ్రుతి శాస్త్రదేశిక గిరాంనామ్న్యర్థ వాదభ్రమః। నామాస్తీతినిషిద్ధవృత్తి విహితత్యాగోహిధర్మాంత రైస్సామ్యం నామనిశంకర స్యదహారేనామాపరాధాదశ॥) అనిచెప్పబడిన నామాపరాధము లున్నా। యీాయనవరతనామస్మరణము వలననే నశించుచున్నవి. ఇందు కుబ్రమాణము పాద్మపురాణములో. (శ్లో॥నామాపరాధ యుక్తానాం నామాన్యే వహరంత్యఘం। అవిశ్రాంత ప్రయుక్తానితాన్యేవార్థకరాణిచ। అనియున్నది.

## —✽ నామస్మరణయంతిమస్మృతినిగల్గించుననుట. ✽—

ఇంకాయీా నామస్మరణము యొక్క యనవర తాభ్యాసము చేత పాపరూప ప్రతిబంధకము లేకపోవుటవలన నైహికేష్టసిద్ధియు భగవద్విషయకమయినయంతిమస్మృతియును గలుగు చున్నది. అంతి మస్మృత్యనంతర మీదేహామందు జీవుడుండి త్రివిధ దోషములలోనే దోషమును జేయుట కవకాశము లేదుగనుక భగవదనుగ్రహద్వార ముగ మోక్షముగలుగుచున్నది. ఇందువలననే భగవద్విషయకమయి న యంతిమస్మృతి బ్రహ్మభావమును బొందుటకు హేతువగుచున్న దనియు, నంతమందు జీవుడే భావమును స్మరించుచున్నాడో యా భావమునుబొందుచున్నాడు గనుక నందువలన దన్నునెప్పుడును స్మ రించుచు యుద్ధముసేయుమని యుదనయందుంచబడిన మనోబుద్ధులు గల్గవాడు తన్నునిస్సందేహముగ బొందు చున్నాడనియు, గీతాశాస్త్రములోని యష్టమాధ్యాయమందు. (శ్లో॥ అంతకాలేచమామేవ స్మరన్ముక్త్వాక ళేబరం। యఃప్రయాతిసమద్భావంయాతినాస్త్యత్రసం శయః। యంయంవాపి స్మరన్భావం త్యజత్యంతేక ళేబరం। తంత

మేవైతికౌంతేయ సదాతద్భావభావితః । తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మరయుధ్యచ । మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః॥) అనిభగవంతుడుచెప్పియున్నాడు.

అయితే, తన్నుస్మరింపుచు యుద్ధముసేయుమని చెప్పుటదియభ్యాసముకొఱకును, నెవరిబాణముచేతమృతిసంభవించునో, యంతిమశ్వాసమెద్దియగునో మున్నుగ దెలియదు గనుకను, యుద్ధకర్మము హింసారూప మయినందున నందులో గామక్రోధా శక్త్యాదులచేత సంభవించిన ధర్మలోపములవలన గలిగెడి పాపనివృత్తికొఱకును, దనయందుమనంబుజేర్చుటవలనదన్నుపొందుటకునుసర్వదాతన్నుస్మరింపవలయుననిభావము.

అయితే, యీనామ స్మరణ రూపోపాసన యత్యుత్కటమై యంతిమస్మృతినిగలుగజేసెనేని మోక్షము సిద్ధించుచున్నది. అట్లత్యుత్కటముగాక జన్మాంతరముసంభవించిన, నప్పుడుపూర్వాభ్యాసముచేతనయ్యుపాసనజేసి సిద్ధినిబొందుచున్నాడు. ఇందుకుప్రమాణము. గీతాశాస్త్రములో షష్ఠాధ్యాయమందు. (శ్లో॥ పార్థనైవేహనాముత్రవినాశస్తస్యవిద్యతే । నహికళ్యాణకృత్కశ్చిద్దుర్గతింతాతగచ్ఛతి । ప్రాప్యపుణ్యకృతాన్లోకానుషిత్వాశాశ్వతీస్సమాః । శుచీనాంశ్రీమతాంగేహే యోగభ్రష్టోభిజాయతే । అథవాయోగినామేవకులేభవతిధీమతాం । ఏతద్ధిదుర్లభతరంలోకేజన్మయదీదృశం। తత్రతంబుద్ధిసంయోగం లభతేపౌర్వదైహికం । యతతేచ తతోభూయస్సంసిద్ధౌకురునందన । పూర్వాభ్యాసేనతేనైవ హ్రియతేహ్యవశోపిసః॥) అనిచెప్పబడియున్నది గనుక యేయోగమును జేయువాడును జెడడు.

అయితే, విష్ణుశివాది భగవద్రూపములలో నేరూపమునకు

సంబంధించిన నామకీర్తనాద్యుపాసనలైననత్యుత్కటముగ జేయువారికంతిమ స్మృతి గలుగుచున్నది గనుకవారలునిర్గుణ బ్రహ్మమేయగుచున్నారు, లేకకించిల్లోపములు గలిగినయెడల నర్చిరాదిమార్గముల సాలోక్యాది పదవులను బొందియుండి భగవంతుడామూర్తి నిదిరోధానము సేయు కాలములో వీరలును ముక్తులగుచున్నారు గాని తిరుగా జన్మింపరు.

## శివకేశవభేదనిరాకరణము.

అయితే, నీశివకేశవులలో నొకడు కార్యకోటిలో జేరినవాడనియు నొకడు కారణకోటిలో జేరినవాడనియు శైవవైష్ణవులు భక్త్యుద్రేకకరములై యర్థవాదరూపములై శాస్త్రములలోనుండు సామాన్య తత్పరభాగములనుబట్టి పరస్పరమీవ్యర్థలతో నా శాస్త్రములలోనుండెడివిశేషభాగములనుగ మనింపక స్కాంద పాద్మములలో జెప్పినసాత్వికతామస విభాగములనుబట్టియు స్కాందహరివంశములలో జెప్పబడియుండెడి, నదైవంశంకరాత్పరం, నదైవం కేశవాత్పరం, అనెడిప్రతిజ్ఞావచనములను బట్టియు నిట్లుచెప్పుచున్నారు, అందుకువక్తయైనవ్యాసులవారికిదత్తమూర్తి పరత్వమును జెప్పుటయందే తాత్పర్యము, ఇంతేగాక. శ్రుతిస్మృతీతిహాసపురాణములలో నుండెడివిశేష శాస్త్రములయందు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కారణకోటిలో జేరినవారనియే, యనేకచోటుల జెప్పబడియున్నది. ఈప్రకారం బనేకోపనిషత్తులలోనును జెప్పబడి యుండుట యేగాకయుపనిషత్తులలో శ్రేష్ఠమైనమాండూక్యోపనిషత్తులోకూనను, బరతత్వమును జెప్పెడిచోట, శివమనియు నద్వైతమనియు, జతుర్థమనియు నిట్లుదలంచుచున్నారనియు జెప్పబడియున్నది, మరియు భగవద్గీతలయందష్టాదశాధ్యాయములో. (శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి । భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా।తమేవశరణం గచ్ఛసర్వభావేనభారత॥)

అనిభగవంతుడు చెప్పినచోటనీశ్వరుడైనయాయనను శరణు పొందుమని చెప్పినాడు, ఎట్లుతన్నుశరణు పొందుమని చెప్పినాడో, యాప్రకార మేయీశ్వరునిని శరణుపొందుమని చెప్పినాడు, మరియునసేకచోటుల విష్ణువచనముగ శివవచనముగ నభేదరూపులైన తమలో నొకనినుపా సించి మఱియొకని ద్వేషించువారు యావచ్చంద్రార్కముసరకములో నుంటున్నారని చెప్పబడియున్నది, గనుకభగవంతుడు విభవావతారము లైనరామకృష్ణాద్యవతారముల నీవలనెట్లుధరించిరో యెట్లుశుద్ధబ్రహ్మ మాదికాలములో జగదుత్పత్తి స్థితిలయములకొఱకు బ్రహ్మాండాంతవర్ తులై దివ్యమంగళములైన బ్రహ్మ విష్ణుశివాది రూపములను ధరించెను ఇందుకు బ్రమాణము, శ్రీభాగవతము ప్రథమస్కంధములో ద్వితీయా ధ్యాయమందు. (శ్లో॥ సత్వంరజస్తమ ఇతిప్రకృతే ర్గుణాస్తైర్యుక్తః పరఃపురుషఏకఇహాస్యధత్తే, స్థిత్యాదయేహరివిరించిహరేతి సంజ్ఞాః శ్రేయాంసితత్రఖలుసత్వతనోర్నృణాంస్యుః॥) అనిచెప్పబడి యున్నది గావునత్రిమూర్తులునుగారణమైనబ్రహ్మముయొక్క యవతారములగుట కుసందేహము లేదుఇంతేగాక యెవరికయితేయపరిచ్ఛిన్న జ్ఞానశక్తులు గలవో వారందఱునీశ్వరకోటిలో జేరినవారేను, అట్లు లేనివారలుజీవ కోటిలోఁ జేరిన వారనియెంచవలసినది.

అయితే, సర్వధర్మములను విడిచితన్ను శరణు బొందితే సర్వ పాపములను బోగొట్టి మోక్షము నిచ్చుచున్నానని భగవద్గీతా చరమ. శ్లోకములో నిభగవదుక్త ప్రకారము శరణాగతియే, మోక్ష సాధన మైయుండగానీభగవదవతారములయొక్క నామస్మరణము మోక్షసాధన మనియెట్లంగీకరింప వచ్చుననియంటేని యాభగవంతునిశరణుబొందుట యనగ నాయననునమ్ముట॥) అట్లు నమ్మినందుకను భావమేనిరంతరము జేయబడెడి నామస్మరణము గనుక భగవన్నామ కీర్తనమే శరణాగతి యగుచున్నది.

## —॥ ధర్మశబ్దతాత్పర్యనిర్ణయము. ॥—

అయితే, చరమశ్లోకములో సర్వధర్మాన్పరిత్యజ్య యనుచోట ధర్మపదము కర్మపరముజేసి, సర్వకర్మములకు స్వరూపత్యాగము వివక్షితమని కొందఱందురు, దేహియెప్పుడును త్రివిధకర్మములలో నేకర్మమును విడిచియుండుటకు సమర్థుఁడుగాఁడు, గనుకసర్వ కర్మస్వరూపత్యాగ మసరియైనదిగాదు, విధ్యుక్తకర్మములు దక్కయితర కర్మములనువిడుచుట భావమని చెప్పినయెడల, సర్వపదమునకు సంకోచ మువచ్చును॥ మఱికొందఱు కర్మజన్య ఫలపరిత్యాగమే యిందుకర్థమని చెప్పుచున్నారు ఆపక్షములో సత్కర్మఫలపరిత్యాగము వలననీశ్వరప్రీతి గలుగునేగాని పాపకర్మఫల పరిత్యాగమువలననీశ్వర ప్రీతిగలుగనేరదు పాపకర్మ ఫలపరిత్యాగమనగ దాఁజేసిన పాపకర్మములకు ఫలమునపేక్షింపకపోవుట వలననేయీశ్వరుఁడాఫలములనీయకమన్నింపడు ఎట్లంటేని, రాజభటుడు రాజునకు సంతోషకరములయిన కార్యములను జేసియందుకు దగినలౌకికఫలమును గోరకరాజుదయనే గోరినయెడల రాజునకు మిక్కిలి దయగలుగుంగాని రాజద్రోహముజేసి యందుకు ఫలమయినశిక్ష పనిలేదనిరాజుదయనేకోరితే రాజుశిక్షింపక వదలడు గదా, కాఁబట్టియీపక్షంబును సరియైనదిగాదు. ఇతరులుసత్కర్మములకుఫలత్యాగము, పాపకర్మములకుస్వరూపత్యాగమర్థమని చెప్పుచున్నారు. ఈపక్షములో బరిత్యజ్యయనెడు పదము ఫలత్యాగస్వరూపత్యాగరూపార్థద్వయము నొకసారిగబోధించుట క్లిష్టమైయున్నది. ఇట్లుదుష్కర్మమునేసేయక సత్కర్మమునే సేయువారికి పాపంబులేలేవు గనుక, (అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః॥) అనిచెప్పియున్నందుకు ప్రయోజనమేమి, యింతేగాక, పాపనివృత్తికొఱకు శరణాగతియే చేయ నక్కరలేదు. అట్లు దుష్కర్మమే చేయక యుండుటకు పూర్వ జన్మ పాపారంభక పాపములచేత

జేయింపబడెడు పాపములను వీ డతిక్రమించుటకు శక్తుడునుగాడు. ఈపక్షంబును సరికాదు, గనుక సర్వధర్మాన్పరిత్యజ్యయనియున్నందున ధర్మశబ్దమున కధర్మములర్థము కాదు; మరియుగర్మములుగాని ఫలములుగాని యర్థముకాదు, కాబట్టి సర్వసుకృత కర్మజన్య ధర్మములను విడువుమనుట యర్థము, తన్నొక్కని శరణు పొందుమనగ, విధ్యుక్తకర్మములయందితరదేవతలనుపాసించు సమయములలో భగవంతుడు సర్వదేవతా స్వరూపుడు గనుక నవ్విభుండే యీ రూపములచేత నుపాసింపబడుచున్నాడనియెంచవలసినదేగాని, దేవతాంతరబుద్ధి నుంచగూడదనిభావము. శరణంవ్రజయనెడి పదమునకు సకృదావృత్తి శరణుపొందుమనుటయర్థము కాదు.

అయితే, సర్వకాల సర్వావస్థలలో నీవేగతియని తన్నునమ్ముమనిస్వారసిక మయినభావము, ఇట్లుశరణు బొందినవారి సత్కర్మములను, భగవంతుడు దయతో నంగీకరించి ప్రారబ్ధాధీనంబుగను గామ క్రోధాదుల వలన, నవశంబుగను జేసెడి పాపకర్మములను మన్నింపుజేసి రక్షించు చున్నాడు. తన్నునమ్ముటయనగ, వైష్ణవులు చెప్పెడు ప్రకారము సకృదా వృత్తి జేయునట్టి శరణాగతి యనియెడు నొకకర్మ విశేషమయితే, యందువలననంతకు మున్నుజేయబడిన పాపములకు మన్నింపుగలుగుంగాని యీవలజేయుపాపములకు మన్నింపు గలుగనేరదు. ఈవలపాపంబే సేయక నుండుటది యెటువంటి వారి కయినను శక్యమయినది గాదు. గనుక శరణు పొందుటయనగ, సర్వకాల సర్వావస్థల యందును భగవంతుని నీవేగతియని నమ్మియుండుట. ఇందు కనుభావ మనవరతనామ స్మరణంబేయగు, నీయనవరత నామస్మరణము వలన పైనజెప్ప బడిన ప్రకార మప్పుడప్పుడు జేసెడు పాపములునశించి యభ్యాసము వలనను, నీశ్వరప్రీతి వలనను నంతిమస్మృతిగలిగి మోక్షము గలుగుచున్నది.

## నామస్మరణబ్రహ్మాద్వితీయజ్ఞానతుల్యమనుట.

అయితే, కొందఱు బ్రహ్మాద్వితీయజ్ఞానమే మోక్షసాధనము గాని యీనామస్మరణము వలన బ్రయోజనములేదని చెప్పుచున్నారు. బ్రహ్మాద్వితీయ జ్ఞానంబీ యనవరత నామ స్మరణమే యగుచున్నది. యెట్లంటేని, దృశ్యమయిన ప్రతివస్తువందు నసత్తులయిన నామరూపములనుదోసివేసి, శేషించినయస్తిభాతిప్రియములే బ్రహ్మమనియోగ సమాధిచేత నిర్వికల్పామనస్కసిద్ధి గలుగుటదియే బ్రహ్మాద్వితీయజ్ఞానము. ఇదిభేదరూపమయిన జీవోపాధినివృత్తించి బ్రహ్మమగుట కుపాయముగా నున్నది. నామ స్మరణ మయితే, నొకడయిన భగవంతుని శరణుపొందినందు కనుభావముగానున్నది, గనుక యిదియీశ్వరప్రీతి ద్వారముగా నొకడయిన భగవంతునితో దనకుగలిగి యుండెడిభేదోపాధినివృత్తిమైతాను బ్రహ్మమగుటకు గారణమయియున్నది. గనుక బ్రహ్మాద్వితీయ జ్ఞానమువలన, నేయభేదము గలుగుచున్నదో యయ్యాభేదమే యీనామ స్మరణమువలనను గలుగుచున్నది. గనుక నీనామస్మరణము బ్రహ్మాద్వితీయజ్ఞానమువంటిదని చెప్ప దగియున్నది, మఱి కొందఱుభక్తియే మోక్షసాధనమని చెప్పుచున్నారు. అదితైలధారవలె నవిచ్ఛిన్న సాలంబనస్మృతిసంతానరూపమే గనుక నాభక్తియోగము పయినఁజెప్పబడిన ప్రకారము యోగసిద్ధిలేనివారికి సాధ్యముగాదు. గనుక నీయనవరత నామస్మరణ రూపస్మృతి సంతానమే మోక్షమును గలుగజేయుచున్నది.

## నవవిధభక్తులు,

ఇందువలననే, నవవిధ భక్తులలో నీనామస్మరణము జేర్పబడి యున్నది. ఇందుకుబ్రమాణము, శేషధర్మములరఅధ్యాయములో. (శ్లో॥ శ్రవణంకీర్తనంవిష్ణోస్స్మరణంపాదసేవనం । అర్చనంవంద

నందాస్యం సఖ్యమాత్మనివేదనం॥ ) అనియున్నది, గనుక భక్తియోగ మీయనవరత నామస్మరణమని చెప్పదగియున్నది.

## కర్మయోగముకంటె నామస్మరణముఖ్యమనుట.

కొందఱు కర్మయోగమే మోక్షసాధనమని చెప్పుచున్నారు. ఆకర్మయోగంబు నీయనవరతనామస్మరణమే యగుచున్నది. ఎందువలననంటేని, కర్మములలో ప్రధానమైనది యజ్ఞము. అది భగవత్స్వరూపమని శ్రుతులలోఁ జెప్పబడియున్నది, ఇదియునుంగాక, శ్రీభగవద్గీతలలో నవమాధ్యాయమందు. ( శ్లో॥ అహంక్రతురహంయజ్ఞ స్స్వధాహమహమౌషధం, మంత్రోహమహమే వాజ్య మహమగ్ని రహంహుతం, పితాహమస్య జగతో మాతాధాతాపితామహః, వేద్యంపవిత్రమోంకారమృక్సామ యజురేవచ, గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్, ప్రభవఃప్రళయస్థానం నిదానంబీజమవ్యయం, తపామ్యహమహంవర్షంనిగృహ్ణామ్యుత్సృజామిచ॥) అమృతం చైవమృత్యుశ్చసదసచ్చాహమర్జున, అనియజ్ఞయజ్ఞాంగమంత్ర స్వాహాస్వధావషట్కారాదులన్నియుదానేయని శ్రీభగవంతునిచేత జెప్పబడియున్నదిగావున, యజ్ఞయజ్ఞాంగాదిసర్వస్వరూపుడైనభగవంతునియొక్క నామజపయజ్ఞమగ్నిష్టోమాది యజ్ఞములకంటె శ్రేష్ఠము, ఎందువలననంటేని, క్రియాబహుళములై యంగలోపములచేత ప్రత్యవాయజనకములై కాలదేశాచారాది నియమాపేక్షగలిగిన యగ్నిష్టోమాది యజ్ఞములకన్న నీభగవన్నామస్మరణ రూపజపయజ్ఞము శ్రేష్ఠమైనది. ఈయభిప్రాయము వలననే భగవద్గీతలలో దశమాధ్యాయమందు. ( శ్లో॥ యజ్ఞానాంజపయజ్ఞోస్మి అనిచెప్పబడి యున్నది॥) ఇంతేగాక మనుస్మృతి ౨ అధ్యాయములో. (శ్లో॥ విధియజ్ఞాజ్జపోయజ్ఞో విశిష్టోదశభిర్గుణైః, ఉపాంశుస్స్యాచ్ఛతగుణః సాహస్రోమానస స్మృతః, అనిచెప్పబడియున్నది. మరియునె

వడు నామస్మరణము సేయుచున్నాడో వాడు చండాలుడైనా శ్రేష్ఠుడని యు దపోయజ్ఞ తీర్థయాత్రాధ్యయనాదులు చేసినవాడనియు వాడేయా ర్యుడనియు శ్రీభాగవతములో దృతీయ స్కంధమందు త్రయస్త్రింశాధ్యాయ ములో గపిలులవారిని దేవహూతి స్తోత్రము చేసినచోట. (శ్లో॥ అహోబత శ్వపచోతో గరీయాన్ యజ్జిహ్వాగ్రేవర్తతేనామతుభ్యం, తేపుస్తపస్తేజు హువుస్సస్నురార్యాబ్రహ్మనూచుర్నామగృణంతియేతే॥) అనియు బృహ న్నారదీయములో.) శ్లో॥ హరిస్మరణనిష్ఠానాంశివనామరతాత్మనాం। సత్యం సమస్తకర్మాణియాంతి సంపూర్ణతాం ద్విజాః॥) అనియు జెప్పబడియున్నది గనుక భగవన్నామ కీర్తనము సేయువాడు అన్ని టిని జేసినవాడేయౌను. పలనంటేని, నామమునకు మంత్రమునకువలెనే స్వర ప్రణవాంగ న్యాసాదులుగాని కాలదేశనియమాదులుగాని లేవు గనుక ఆచండాలము సర్వదాస్మరింపదగినది. ఇందుకు ప్రమాణము, వైశ్వానరస్మృతిలో. (శ్లో॥ నోదేశకాలనియమ శ్శౌచాశౌచవినిర్ణ యః।పరంసంకీర్తనాదేవ రామరామేతిముచ్యతే॥ ) అనియున్నది.

## ☸ రామనామప్రభావము. ☸

ఈ ప్రకార మనవరతనామస్మరణము ముఖ్యముగనుకనే యభేద ర్యాపులయిన సాంబశివులవారీనామ స్మరణము యొక్క ప్రాశస్త్య మునుజూపుటకును భగవంతుడు సర్వతీర్థాత్మకుడని చెప్పబడియుం డెడివచనమును దృఢపఱచుటకును, పాపశాంతి జేయుటయందు భగవ న్నామముతోడ సమానమయిన గంగను శిరమునందెల్లప్పుడును ధరించు కొని భగవన్నామమయిన రామనామంబు ననవరతము స్మరించుచు న్నారు. ఈరామనామమనెడు తారకమంత్రమును దక్షిణకర్ణములో నుపదేశముజేసి తరింప జేయవచ్చుననెడి నమ్మకమువలననే శ్రీకాశిలో మృతి జెందినవారి కందఱికి మోక్షము నిచ్చుచున్నానని సాంబశివుల

వారుప్రతిజ్ఞ జేసియున్నారు. వాల్మీకాది మహర్షులకీనామమే వ్యత్య స్తముగనుచ్చరించినను, దారకమయినది. ఇందుకుప్రమాణము. స్కాంద ధర్మఖండ ప్రథమాధ్యాయమందు. (శ్లో॥వ్యత్యస్తంవా సమస్తంవా రామనామస్మరంతియే॥) అనియున్నది. ఇదియునుంగాకభగవన్నామ ములలో రామనామము శ్రేష్ఠము. ఎందువలననంటేని, నారాయణా ష్టాక్షరీ శివపంచాక్షరీ యీమహామంత్రములలోనుండువర్ణములలో సారములయిన రామాయను వర్ణములతోటి ఘటితమయినది. ఎట్లు నగా, ప్రణవపూర్వకమయిన నారాయణాష్టాక్షరిలో, నమోనారా యణాయ, యనియున్నది. దానిలోరాకారమునుదొలగించితే నాయ ణాయ, అనియపార్థ మవుచున్నది. శివపంచాక్షరిలో, ప్రణవపూ ర్వకముగా, నమశ్శివాయ, యనియున్నది. దానిలోమకారమును దొ లగించితే, నశివాయ, యని యపార్థ మవుచున్నది, గావునరామః అనువర్ణములీమంత్రములలో సారములయినవి. ఇంతేగాక, త్రిమూ ర్తిస్వరూపమయిన పరబ్రహ్మస్వరూపమును బ్రతిపాదించునదియును గనుక రామనామమే శ్రేష్ఠము. ఈవిషయము తత్వసంగ్రహరామా యణములో వివరింపబడియున్నది. మఱియు. (శ్లో॥ శ్రీరామరామరా మేతిరమేరామేమనోరమే। సహస్రనామతత్తుల్యంరామనామవరాన నే॥) అనియిట్లు విష్ణుసహస్రనామ సదృశమయినది రామనామ మని యును జెప్ప బడియున్నది.

## భగవంతునికంటె భగవన్నామమే యుత్తమ మనుట.

ఇంతియేకాకభగవంతునికన్నను భగవన్నామమేయుత్కృష్టమని చెప్పబడియున్నది. ఎందువలననంటేని, భగవంతుడుతన్నుతత్వముచేత దెలిసి కొన్నవారికిని దన యవతారములను బ్రత్యక్షీకరించిన వారికిని

మాత్రమే మోక్షమునిచ్చుచున్నాడు, భగవన్నామమైతే తత్త్వముదెలియక స్మరించినవారికిని, నామోద్దేశములేక కిరాతులు ఆహారప్రహారయనియు ను, వనేచరామః వసుచాహారామః యనియునుసీరీతిగలౌకిక శబ్దఘటన వశముచేత నామవర్ణాను పూర్వి నుచ్చరించినవారికిని, భగవంతునిపేరు గలవారినిబిలిచినవారికిని, క్రమముగమోక్షమునుగలుగ జేయుచున్నది, ఎందువలననంటేని, యొకరినిబిలిచిన నాపేరుగలమరియొకడు తన్నుబిలిచినారనిపలికినట్లుగ భగవదుద్దేశములేకనే యేవిధముగానైనఆ నామమును చ్చరించినను భగవంతునకు వీనియందు మతిగలుగుచున్నది. ఇందుకు ప్రమాణము, శ్రీభాగవతము షష్ఠస్కంధములో ద్వితీయాధ్యాయమందు. (శ్లో॥ సర్వేషామప్యఘవ తామిదమే వసునిష్కృతం, నామవ్యాహరణం విష్ణోర్యత స్తద్విషయామతిః, అనియున్నది॥) ఇందువలన నవశముగా భగవన్నామ ముచ్చరింపబడినను సర్వపాపములను నశింపజేసి మోక్షము నిచ్చుచున్నది. ఇందుకుప్రమాణము, ఆయధ్యాయములోనే. (శ్లోకం॥ అయంహికృతనిర్వేశో జన్మకోట్యం హసామపి। యద్వ్యాజహార వివశోనామ స్వస్త్యయనంహరేః ॥) అనియున్నది, యింతియేగాక, ద్వేషముచేతగాని హాస్యముచేతగాని యితరవ్యాజముల చేత గానినామమునుచ్చరించిన వారికందఱికిని నామము మోక్షమును గలుగజేయుచున్నది. ఇందుకుప్రమాణమాయధ్యాయములోనే. (శ్లో॥ సాంకేత్యం పారిహాస్యంవాస్తోభంహేళనమేవనా । వైకుంఠనామగ్రహణమ శేషాఘహరంవిదుః॥) అనిచెప్పబడియున్నది.

ఆయితే, ద్వేషాదులచేతనైనను నామస్మరణము జేసినబుద్ధిపూర్వకంబుగజేసెడి పాపములను భగవంతుడు పోగొట్టి రక్షించుచున్నాడని చెప్పుటది న్యాయవిరుద్ధముగా నున్నదేయని యంటేని, యది సరిగానున్నదియైతేయే శాస్త్రములలోజగత్కారణమైన భగవంతుడుగలడని చెప్పబడియున్నదో యాశాస్త్రములలోనేయేవిధముగా

నైన నాభగవంతుని యొక్క నామస్మరణము జేసిన యెడల సమస్తపాపములను బోగొట్టిరక్షించు చున్నాడనియును జెప్పబడియున్నది. ఇందుకు ప్రమాణము పాద్మపురాణ పాతాళఖండమున. (శ్లో॥ మన్నామయేషాం మరణేసమాప్తే మచ్చేతసామన్యధియాంచనామ। హీనాక్షరంవాధికవర్ణయుక్తంమమైవలోకం ప్రదదామిసత్యం॥) అనియున్నది, శ్రీభాగవత షష్ఠస్కంధ ద్వితీయాధ్యాయమున. (శ్లో॥ అజ్ఞానాదథవాజ్ఞానాదుత్తమశ్లోకనామయత్ । సంకీర్తితమఘంపుంసోదహత్యేధోయథానలః॥) అనియునున్నది, కాబట్టిభగవంతుడునిజమైనట్టులైతే పాపములు నిజమేయగుచున్నవి, భగవన్నామస్మరణము చేతబాపములు నశించుటయు నిజమేయగుచున్నది, యట్లుగాక నామస్మరణము వలనబాపములు నశింపని యెడలభగవంతుడు నసత్యమేయగుచున్నాడు, పాపంబులునసత్యము లేయగుచున్నవి, గనుక భయంబే లేదు.

## రాగద్వేషవశుడయి చేసిన పాపములును భగవన్నామస్మరణ వలనబోననుట.

మఱియు భగవంతుడు సత్యంబేమైనను దననామ స్మరణము వలన, నబుద్ధి పూర్వకంబుగ జేసిన పాపములను బోగొట్టునేగాని బుద్ధిపూర్వకంబుగ జేసిన పాపములను బోగొట్టునాయని యంటేని, యబుద్ధిపూర్వకముగ జేసినపాపములు దోషావహంబులేగావు. గనుక భగవంతుడు వాట్లను బోగొట్టవలసిన దేపనిలేదు.

అయితే, బుద్ధిపూర్వకంబుగ నయినను రాగద్వేషాదులవలన నవశుడయి చేసినపాపములనే నామస్మరణము వలనబోగొట్టుచున్నాడు. అట్లునామస్మరణము వలన బాపములను బోగొట్టు చున్నాడని యెంచికపటముచేత గావలెనని పాపములను జేయగూడదు.

అయితే, నిషిద్ధములయిన కామక్రోధాదులను త్యజింపకవాటికి

లోబడి పాపములను జేయుటది కపటముచేత జేసినట్లుగాదా, యని యంటేని, భగవంతుడుతన లీలార్థమయి జీవులకు నింద్రియాదులనిచ్చి విషయములను గల్పించి యావిషయ సంబంధమువలన జీవులకానందాదులు గలుగునట్లుచేసి యెటువంటివిద్వాంసుల మనంబులనయినను విషయములనుగూర్చియాకర్షించునట్టి శక్తినింద్రియములకు గలుగజేయుచున్నాడు. ఇందుకుప్రమాణము. స్కాందముధర్మఖండపూర్వభాగ త్రయోదశాధ్యాయమందు. (శ్లో॥ మాత్రాస్వస్రాదుహిత్రాచనైకత్ర సహసంవసేత్ । బలవానింద్రియగ్రామోవిద్వాంసమపికర్షతి॥) యని యున్నది. యీశ్లోకమేమనుస్మృతిలోనునున్నది, గనుక, నిట్టియింద్రియసంబంధములయిన కార్యములవలనగలిగెడి పుణ్యపాపములకుదగిన జన్మములనిచ్చుచుజీవులయొక్క ప్రారబ్ధబలాబలముల ననుసరించిస్వేచ్ఛానిచ్ఛాపూర్వకంబుగ సుఖదుఃఖముల ననుభవింపజేయుచు నీరీతిని ప్రపంచలీలను భగవంతుడు సేయుచున్నప్పుడట్టి భగవత్సంకల్పమునకు విరోధముగ జీవులు స్వాతంత్ర్యముచేత గామక్రోధాదులను ద్యజించి విషయనివృత్తులయి బుద్ధిపూర్వకముగనయినను బాపములను జేయక నుండగలరా, కాబట్టి కామక్రోధాదులచేతనవశుడయిచేసెడి పాపములు కపటముచేత జేయంబడినవని చెప్పగూడదు. గనుక నిట్టిపాపములను భగవంతుడు తననామస్మరణమువలన బోగొట్టుచున్నాడు. అటుగాక నామస్మరణమువలనబాపములు పోగొట్టలేకపోయెనేనితన నామస్మరణ మేవిధముగ జేసినను వానిపాపములను బోగొట్టిరక్షించుచున్నానని భగవంతుడుచేసిన ప్రతిజ్ఞకేలోపము గలుగుచున్నదిగాని జీవులట్లనేకకాలమునుండి పుట్టుచుజచ్చుచు బాపములనుజేయుచు సుఖదుఃఖముల ననుభవించుచు నుండుటది జీవుల కభ్యాసమై యున్నది. గాబట్టి వీరలకేలోపములును లేకపోవుటయేగాక, భగవంతుని నామస్మరణము వలన బోగొట్టజాలని పాపములను చేసినారన్నకీర్తియు

గలుగుచున్నది. కాబట్టి వేసటపడక ననవరతమునామస్మరణముసేయు చునుండవలయునది.

### భగవన్నామమహిమవేదోక్తమనుట.

ఋగ్వేదము రెండవ యష్టకము రెండవ అధ్యాయము ౨౫ పనసలోనున్న, నాలవ అధ్యాయము ౧౬ పనసలోనున్న, ఐదో అష్టకం ౬ అధ్యాయం ౨౬ పనసలోనున్న, యజుర్వేదం౨ అష్టం రెండవపన్నం ౬౮ పనసలోనున్న, పరాయితం రెండో అష్టం నాలుగోపన్నం ౨౫ పనసలోనున్న,భగవన్నామమహిమచెప్పబడియున్నది. గనుక భగవన్నామ స్మరణము ముఖ్యము. ఇంతేగాక, సాధారణముగా లోకములోరాజైనవాడు తనశత్రువుతనతో యుద్ధముచేసివిశేషముగ జెఱుపునుజేసి వెనుక శరణుజొచ్చితే వానియొక్క దోషముల నన్నిటిని మన్నించి రక్షించునప్పుడు, సర్వస్వతంత్రుడయిమహాదయాళుడయినభగవంతుడు, తన్నుస్మరించినవాని పాపములనుబోగొట్టిరయే లరక్షింపడు, గనుక పాపములననశింప జేసెడివిషయములో నామ స్మరణముకన్నను ముఖ్యమయినయుపాయములేదు, ఇందుకుశంకరాచార్యులవారు భగవంతుని దశావతారములను స్తోత్రముచేయుచోట. (నామస్మరణాదన్యోపాయంనహిపశ్యామోభవతరణే|) అనిచెప్పియున్నారు.

### జపమాలికాప్రయోజనము.

ఇట్లనవరత నామస్మరణముసేయు వారిమనసు, కార్యవశముచేతనన్యాసక్తమయినప్పుడును, నప్రయత్నంబుగ నీషన్నామోచ్చారణముగలుగుటకును గార్యాంతమందుమరలనామస్మరణముగలుగుటకును, జప మాలాధారణము ముఖ్యసాధనమై యున్నది.

## కలిలో శ్రీకృష్ణనామము శ్రేష్ఠమనుట.

ఇట్టి సర్వోత్కృష్ట మయిన భగవన్నామ ముల యన్నింటిలో శ్రీకృష్ణనామము కలిలో ముఖ్యమయినది. ఇందుకు ప్రమాణము. శ్రీభాగవతముదశమస్కంధములో బంచదశాధ్యాయమందు, కృతత్రేతా ద్వాపరయుగములయందు శుక్లరక్తపీత వర్ణముగల రూపములను ధరించి యిప్పుడు కలిలో కృష్ణవర్ణముగలరూపమును ధరించినారుగనుక వీరికి కృష్ణులని పేరుపెట్టవలయునని. (శ్లో॥ వర్ణాస్త్రయఃకిలాస్యాస న్గృహ్ణతోనుయుగంతనూః। శుక్లోరక్తస్తథాపీతః ఇదానీంకృష్ణతాం గతః॥) అనెడి శ్లోకముచేత జెప్పి యీప్రకారముగ గర్గాచార్యులవారు నామకరణము చేసినారు, కావున, శ్రీకృష్ణనామము కలిలో ముఖ్యమై యున్నది, యిందుకు ప్రమాణము. శ్రీభాగవతము ఏకాదశ స్కంధములో పంచమాధ్యాయమందు. (కలౌకృష్ణంత్విషాకృష్ణం సాంగోపాంగాస్త్రపార్షదం। యజ్ఞైస్సంకీర్తనప్రాయైఃయజంతిహిసుమేధసః॥) అనియును నింకాద్వాదశస్కంధము తృతీయాధ్యాయమందు. (శ్లో॥ కలేర్దోషనిధే రాజన్నస్తిహ్యేకో మహాన్గుణః। కీర్తనాదేవ కృష్ణస్యముక్తబంధఃపరంవ్రజేత్॥) అనియుమరియు విష్ణుపురాణములో ద్వితీయాంశషష్ఠాధ్యాయమందు. (శ్లో॥ ప్రాయశ్చిత్తాన్యశేషాణితపః కర్మాత్మకానివై। యానితేషామశేషాణాంకృష్ణానుస్మరణంపరం॥) అనియు జెప్పబడియున్నది. యిదియునుంగాక, బ్రహ్మవైవర్తపురాణములో బ్రహ్మాండముబయలనున్నగోలోకవాసియైనశ్రీకృష్ణుండే బ్రహ్మవిష్ణుమహేశ్వరాది సర్వప్రపంచ స్వరూపముగా నైనందున సర్వకారణకారణస్వరూపుడనియు, శ్రీవైకుంఠవాసియైననారాయణమూర్తియు శ్వేతద్వీపవాసియైనవిష్ణుమూర్తియు, ధర్మపుత్రులయిన నరనారాయణులలో నారాయణమూర్తియు, గోలోకవాసియైనశ్రీకృష్ణమూర్తి

లోకలసి, భూలోకమందు శ్రీకృష్ణావతారమెత్తినారనియును బ్రతిపాదింపబడియున్నది. యీయభిప్రాయమువలననే శ్రీభాగవతము ప్రథమస్కంధములో ద్వితీయాధ్యాయమందు భగవంతుని యొక్కయిరవైరెండవతారములను బ్రతిపాదించి విభూతిమంతులయిన ఋషులు మొదలయినవారలును భగవత్కళలేయని చెప్పి. (శ్లో॥ ఏతేంశాంశ కళాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయం।) అని నిర్ణయించి యున్నారు, యిదియునుంగాక, లోకానుగ్రహార్థమే భగవంతునిచేత ధరింపబడినయవతారములలో శ్రీకృష్ణావతారము ముఖ్యమైయున్నది, యెందువలననంటేని, యీశ్రీకృష్ణమూర్తి యనేకవిరోధపరిహారపూర్వకంబుగ దనతత్వనిర్ణయకరమైన గీతాశాస్త్ర మర్జునుని నిమిత్తీకరించి ప్రకటన జేసినదానిలో చరమ. (శ్లోకములు॥ మన్మనాభవమద్భక్తోమద్యాజీమాంనమస్కురు। మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసి మే, సర్వధర్మాన్పరిత్యజ్యమామేకంశరణంవ్రజ, అహంత్వాసర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచః।) అనెడునీరెండు. శ్లోకములచేత మోక్షోపాయములలో ముఖ్యంబును। సులభంబునైనశరణాగతిననుగ్రహించినారు, యిదేరీతి, నుద్ధవుల వారికిని శ్రీభాగవత మేకాదశస్కంధములో ద్వాదశాధ్యాయమందు. (శ్లో॥ మత్కామార మణంజారం మత్స్వరూపావిదోబలాః। బ్రహ్మమాం పరమంప్రాపుః సంగాచ్ఛతసహస్రశః। తస్మాత్త్వముద్ధవోత్సృజ్యచోదనాంప్రతిచోదనాం, ప్రవృత్తించనివృత్తించశ్రోతవ్యంశ్రుతమేవచ, మామేకమేవశరణ మాత్మానంసర్వదేహినాం యాహిసర్వాత్మభావేన మయాస్యాహ్య కుతోభయః, అనిశరణాగతినుపదేశము జేసి నట్లు చెప్పబడి యున్నది, గనుకనున్ను, మరియు భగవద్గీతలలో తృతీయాధ్యాయమందు. (శ్లో॥ యేత్వేతదభ్యసూయంతోనానుతిష్ఠంతిమేమతం। సర్వజ్ఞానవిమూఢాం స్తాన్విద్ధి నష్టానచేతసః. అనెడిశ్లోకముచేత తనవాక్యములయందసూయగలిగితనయభిప్రాయ ప్రకారమనుష్ఠింపక పోయినవారు చెడిపోవుదురని భగవంతుని

చేత జెప్పబడియున్నది, గనుకను శ్రీకృష్ణులను నమ్ముటదియే ముఖ్యము గానున్నది, అట్లునమ్మినందు కనుభావ మనవరతము శ్రీకృష్ణనామముస్మరించుటయేను, యీయభిప్రాయమువలననె శ్రీగీతాశాస్త్రములో నవమాధ్యాయమందు. (శ్లో॥ సతతంకీర్తయంతోమాం యతంతశ్చదృఢవ్రతాః । నమస్యంతశ్చమాంభక్త్యా నిత్యయుక్తాఉపాసతే॥) అనిచెప్పబడియున్నది, శ్రీయనగా భగవత్సర్వశక్తిస్వరూపురాలై యత్యంతప్రియతమమైనరాధగనుక, నట్టిరాధాసహితుడయినకృష్ణుండు. శ్రీకృష్ణనామమునకర్థము. ఇందుకుప్రమాణము. బ్రహ్మవైవర్తపురాణములో శ్రీకృష్ణజన్మఖండములో బంచదశాధ్యాయమందు, రాధతో శ్రీకృష్ణులవారు.(శ్లో॥ కృష్ణంవదంతిమాంలోకా స్త్వయావిరహితంయదా । శ్రీకృష్ణంచతదాతేపి త్వయైవ సహితంపరం ॥ ) అనిచెప్పినట్టు లున్నది. గనుకనీనామమత్యంతభగవత్ప్రీతికరమై, యైహికాముష్మిక సర్వసంపత్కరమైయున్నది.

## శ్రీకృష్ణుండుభగవంతుడనుట.

అయితే, శ్రీకృష్ణులచర్యల వలన నొక మహారాజని చెప్పదగియున్నాడనియంటేని. యట్లుజెప్పగూడ దెందువల్లనంటేని, యే వేదములలో గారణస్వరూపనిరూపణము జేసియున్నదో యా వేదములలోనే. ఋగ్వేదము ఖిలసంహితలో జగత్కారణముశ్రీకృష్ణులనియు, గోపీనాథుడనియు, రుక్మిణీశుడనియు, మరియు నారాయణోపనిషత్తులో, దేవకీపుత్రుడనియు, మరియు గోపాలతాపిని, కృష్ణోపనిషత్తువాసుదేవోపనిషత్తు మొదలయినవాటిలోను నీశ్రీకృష్ణులేజగత్కారణమనియు నసాధారణ నామములతో జెప్పబడి యున్నందువలన, నాయనయొక్క యమానుషచర్యలవల్ల భగవంతుడనియే చెప్పదగియున్నది.

## అన్నింటిలో సంస్కృతమయ వేదము ముఖ్యమనుట.

అయితే, మీవేదములలో జెప్పబడియున్నందువలన ఆయన జగత్కారణమయ్యెడి పక్షములో నితర మతస్థులవేదములలో దేవుడని చెప్పబడెడివారిని గారణమని మీరొప్పుకొనుచున్నారాయని యంటేని, యటులదగిన హేతువులున్నపక్షమునకు నొప్పుకొనుచున్నాడను.

అయితే, నాయీ మతస్థులభాషలలో నుండెడివేదము లన్నిటి కన్నను సంస్కృతభాషతో నుండెడి నాలుగువేదములు మిగుల ప్రమాణములని చెప్పవలయును, ఎందువలననంటేని, సంస్కృతభాషయొక్క పర్యాయ పదములవలనదద్భవ, తత్సమములుగా ననేక భాషలు పుట్టుట వలనసంస్కృత భాషమాతృభాషయని చెప్పవలయును.

అయితే, మఱియొక భాషలో నుందునామమును సంస్కృతభాషలో నుండెడు నేనామముయొక్క తద్భవమనిమీరు చెప్పుచున్నారో, యాభాషయొక్క యానామము వల్లనెగలిగినతద్భవ మీసంస్కృతనామమని చెప్పగూడదాయనియంటేని, యటులజెప్పగూడదు, ఎందువలన నంటేని, సంస్కృతభాషలో నొకయర్థమును జెప్పెడునపేకపర్యాయ నామముల వలనననేకభాషలు, తద్భవ తత్సమ ములుగాబుట్టినప్రకార మితరమైన యేభాషయొక్క పర్యాయనామములవలన నేకభాషలుపుట్ట లేదు సంస్కృతభాషకుదేశములేదు. గనుక నిందుకిదియే పెద్దసాక్ష్యముగనున్నది, గావున నితరభాషలతోనున్న వేదములకంటే సంస్కృతభాషతోనుండెడి మావేదములు ముఖ్యములయినవిగనెంచవలయునది గావున నిట్టివేదప్రతిపాద్యుడయిన శ్రీకృష్ణులు జగత్కారణమనుటకు నేసందేహములేదు, కారణమయిన భగవంతుడే లోకానుగ్రహార్థమయి శ్రీకృష్ణాదిరూపములతో మనుష్యులవలెనే జన్మములెత్తికర్మము

లను జేయుచున్నాడని మున్నే చెప్పబడియున్నది. యటుగాక శ్రీకృష్ణుందు జీవుండేయైనను జీవేశ్వరుల కుపాధిభేదమేగనుక యాయన విశేషజ్ఞానియగుటచేత, నుపాధినివర్తించి యీశ్వరుండేగావచ్చును.

అయితే, దేహమున్నంత వఱకు నుపాధి నివర్తింపదే యని యంటేని, ఆయనయద్భుత చర్యలవలన భగవత్ప్రీతికి పాత్రుడనియైనను జెప్పవచ్చును, గనుక తపశ్శాలులయినవారి శాపానుగ్రహ వాక్కులను భగవంతుదుసార్థకము జేయునట్లు శ్రీకృష్ణులుతన్నునమ్మితే రక్షించుచున్నానని చెప్పినవాక్యమును శ్రీకృష్ణులపుణ్యామునుబట్టి యా భగవంతుడు సార్థకమును జేయు చున్నాడు, గనుక శ్రీకృష్ణులను నమ్మి శ్రీకృష్ణనామకీర్తనము జేయుటయెన్నటికిని వ్యర్థముకానేరదు, ఇదిసత్యముఇందుకు గీతలలోనవమాధ్యాయమందు. (శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాంయేజనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాంయోగక్షేమంవహామ్యహం ॥) అనిభగవంతునిచేఁ జెప్పబడియున్నది. ఇందు కన్యదేవతా చింత లేకతన్ను జింతించుచు నుపాసనసేయువారి యోగక్షేమమును దానువహించు చున్నాడనిభావము.

అయితే, నిత్యనైమిత్తిక కామ్యాదులయందన్య దేవతోపాసన యావశ్యకమని విధింపబడియున్నదే యనియంటేని, గీతాశాస్త్రములో సర్వము తానేయని చెప్పబడియున్నది, గనుకసర్వదేవతలుభగవత్కళలేగావున విరోధములేదు.

అయితే, అన్యచింతలేకయుండవలయు ననుటకన్యదేవతా మాత్రోద్దేశ్యము గాకుండ తద్దేవతాస్వరూపముచేత ఫలప్రదాతభగవంతుండేయనిచింతింప వలయుననిభావము, మఱియుద తద్దేవతారూపముచేతఫలప్రదాత తానేయని. (శ్లో॥ పుష్ణామిచౌషధీస్సర్వాస్సోమో

భూత్వారసాత్మకః ॥ ) ఇత్యాదిశ్లోకములచేతగీతాశాస్త్రములో జెప్ప బడియున్నది, యోగమనగనిదివఱకు బొందకయుండెడు నిష్టార్థమును బొందుట, క్షేమమనగ బ్రాప్తమైనవాటిని రక్షించుట, గనుకశ్రీకృష్ణు లనునమ్మినవారై హికాముష్మికములగోరకపోయి నప్పటికిని వారియోగ క్షేమమునుదానేవహించుచున్నాడు.

—✿ భగవదనుగ్రహముచేఁబ్రారబ్ధమునునశించుచున్నదనుట. ✿—

అయితే, భగవదనుగ్రహమువలన నాగామిసంచితంబులేన శించుంగానిప్రారబ్ధము నశింపదనియు, నిట్టిప్రారబ్ధప్రతిబంధమువలన గొన్ని నైహికేష్టములు సిద్ధింపవనియుఁ గొందఱు చెప్పుచున్నారు; అట్లుచెప్పగూడదెందు వలననంటేని, భగవంతునిదృఢముగానమ్మినందు కనుభావములైన జపతపస్సత్య శౌచాదులవలన నాయనయనుగ్రహము ను విశేషంబుగగలుగజేసి కొనవలయునే గానియాయనకట్టి దయగలి గితే ప్రారబ్ధంబును నశింపజేసీ సకలేష్టములను సిద్ధింప జేయకమానడు ఇందుకుదృష్టాంతము, మార్కండేయుల వారికిబ్రారబ్ధ ప్రకారమునిర్ణ యమైనకాలమృత్యువును సర్వస్వతంత్రుడైన భగవంతుడు పోగొట్టియనే కబ్రహ్మకల్పములు జీవించియుండు నట్లనుగ్రహింపలేదా యింత్తేగాకకు చేలునికిబూర్వ ప్రారబ్ధము లేకయుండినను నటుకులుభక్షించి, యపు డైశ్వర్యమునీయలేదా, గనుక అనన్యముగనమ్మినవారిప్రారబ్ధమును బోగొట్టి భగవంతుడైహికాముష్మికముల యందునువాని రక్షించుచు న్నాడు.

అయితే, యనన్యముగ దన్ను జింతింపుమని చెప్పియుండెడివా క్యమునకు శ్రుతిస్మృతులలోని త్యనైమిత్తికాదులయందు విధింపబడిన యింద్రాదిదేవతో పాసనలను గూడవిడిచి పెట్టియొక విష్ణువునేయు పాసించుట భావమనికొందఱు వైష్ణవులుచెప్పుచున్నారు, ఈలాగుననే

శివుని నుపాసింపవలయునని శైవులును జెప్పుచున్నారు, అట్లుజెప్పుటసరికాదు. ఎందువలననంటేని యొకభగవంతుండే దేవనరపశ్వాది సర్వప్రపంచ స్వరూపంబుగ బరిణమించుచున్నాడనియు, నేయేదేవత నుపాసించు వారికాయా దేవతా స్వరూపముగ నాఫలమును భగవంతుండేయిచ్చుచున్నాడనియు శాస్త్రముచేతను యుక్తులచేతను నెగువ జూపించియున్నాను, గనుక భగవంతుని కన్నన్యము గనుపడలేదు. అటులగానియెడలలోకమందుఁ బరస్పరమసూయాదులు గలిగినరాజులెదిరిరాజునునమ్మక తన్నే నమ్మినవారిని రక్షించుచున్నామని చెప్పినట్లు భగవంతుడును దనకంటే వేరే దైవమున్నట్లు భావించి తన్నే నమ్ముమని యీర్ష్యతో జెప్పినట్లేర్పడుచున్నది.

అయితే, భగవంతునికి లోబడిన యనేకదైవము లాయనకంటే వేరుగా నుండరాదా యనియంటేని, యీషదధికారముతోనైన దనపరిణామములుగాక వేరుగాదేవతలు గొందఱున్నపక్షమందు లోకములో రాజులవలెనేయొక్కొక సమయములో నొకడొక డధికారియైనట్లు దేవతలు నొక్కసమయములో భగవంతుని కన్న నధికులుగావచ్చును, ఇంతేగాక భగవంతునికంటే వేరుగ దక్కువమైనవారు, కొందఱున్నపక్షమందు హెచ్చైనవారు కొందఱుండ వచ్చును. మఱియు వీరలు తమదేవతలయుత్కర్షమును దెలియజేయుటకై తాము వైష్ణవులమనియు, శైవులమనియు, జెప్పుకొనుటవలన, దమదేవతలకారణత్వమునకు హానినే గలుగజేయుచున్నా రెట్లంటేని, లోకములో నాయారాజభటులు తమతమరాజేయెక్కువనిచెప్పుకొన్నట్టులయితే వారిరాజునకు దయవచ్చి వారినివృద్ధికిదెచ్చినను. గొండొక రాజభటుడననిచెప్పుకొనుటవలన, వేరొకరాజున్నాడని యేర్పడినట్లు విష్ణ్వాదికారణత్వములో జేరినవారమనెడునర్థముగల వైష్ణవులుశైవులను పదములచేత నీవిష్ణ్వాది వ్యతిరిక్తమయిన కారణమున్నదనియు

నట్టికారణత్వవాదులు కొందఱున్నారనియు చేర్పడుచున్నది. గనుక వీరలుచెప్పెడిమాటసరికాదు. కాబట్టి భగవంతునియొక్క పరిణామమే దేవనరమృగాది సర్వప్రపంచమని చెప్పవలయునది. దేవతలు కార్యకోటిలోఁజేరినవారయినను వారలును భగవత్కళాస్వరూపులే గనుక తనయంశములను నమ్మితే భగవంతుని కసూయ కలుగునా, కాబట్టి యనన్యముగా భగవంతుఁడుతన్నుభజింపుమనిచెప్పుటకేవిధముగ నేదేవతనుభజించినను దన్నే చెందుచున్నదని తాత్పర్యము.

అయితే, అన్యదేవతామాత్రోద్దేశముగా నుపాసించిన యెడలనంతవంతములయిన ఫలములనేపొందుదున్నారు. గనుకయిట్టివాస్తవమునుగుర్తెఱిగి యన్యదేవతా మాత్రోద్దేశముగాకుండ భగవంతుడే యీరూపముగఫలము నిచ్చుచున్నాడని యెంచిభజించు వారియొక్క యోగక్షేమమునుదానేవహించియైహికాముష్మికసకల ఫలములనిచ్చుచున్నాడని భావము.

## ప్రారబ్ధనాశమునుగూర్చి క్రీస్తులు చేయునాక్షేపమునునిరసించుట.

అయితే, భగవంతుడు తన్నునమ్మినవారియొక్కపాపములను బోగొట్టి రక్షించుచున్నాడని చెప్పితిరే, యీయీపాపముల కీయీ శిక్షయని నిర్ణయించిన భగవంతుడు పాపానురూపమయిన శిక్షను జేయకమన్నింపుజేసియెట్లు రక్షించుచున్నాడు. ఇదిస్వోక్తివిరోధము కాదాయనియు. దమయేసుక్రీస్తుతనభక్తులయొక్క పాపములకుబదులుగదానుకొఱతనువేయబడిరక్తమును జిందించిభక్తులనురక్షించినాడు, గనుకయిదిపాపములకు బదులుగదాను కొఱతనువేయబడి భక్తులను రక్షించినాడు, గనుక యిదిపాపములకు క్రమమయినమన్నింపనియు, క్రిస్టియనులు చెప్పుచున్నారు.

అయితే, మేముచెప్పెడి పాపములయొక్క మన్నింపుభగవంతునకెంతమాత్రము స్వోక్తివిరోధముగా దెట్లంటేని, తత్తత్పాపానుగుణమయినశిక్షను నిర్ణయించిన భగవంతుడే దయగలవాడు గనుక మనుష్యుడనేక పాపములజేసిన వెనుక, ననుతాపముగలిగితనకుగాని తనముఖ్యభక్తులకుగాని శరణాగతిజేసినపక్షమందు వానిపాపములను మన్నించిరక్షించుచున్నాననియు నిర్ణయించియున్నాడు గనుక నట్టి నిర్ణయప్రకారము భగవంతుండు శరణాగతునిపాపములను మన్నించి రక్షించుటయందు స్వోక్తివిరోధమేమియును లేదు. యెట్లంటేని. యెవ్వరుభక్షించుచున్నారో, వారిని జంపునట్టి స్వభావముగల విషమును బుట్టించిన భగవంతుడా విషమునుహరించి బ్రతికించునట్టిస్వభావముగలయౌషధినింబుట్టించి యున్నాడు. ఈదృష్టాంతముచేత బాపములనెడి విషమునకు శరణాగతియనునదియౌషధముగనుక నేను జెప్పినదియే, పాపములకు గ్రమమయినమన్నింపు, వారుచెప్పెడి క్రమమేమనగ, లోకములోనొకనిఋణమునకుగా దేశాధిపతిచేత గారాగృహములో నుంచబడినవాని ఋణమును మఱియొకడొప్పుకొనియాపైకముజెల్లించి యట్టికారాగృహబద్ధుడయినవాని విడిపించినట్లు, తమయేసుక్రీస్తుతన భక్తులపాపములకు బదులుగదాను కొరతనువేయించుకొని వారలపాపమును మన్నించిరక్షించినాడని దృష్టాంతమును క్రిష్టియనులు చూపుచున్నారు. ఇదిసరిగాదెందు వలన నంటేని, యీదృష్టాంతములో ఋణముదీరుటయే,ముఖ్యోద్దేశము గనుక యాఋణమునెవ్వడుదీర్చిననునాబద్ధుడయినవాని విడువవచ్చును. వారిబైబిల్లో మోశేయొక్క నాలుగో గ్రంథము ౧౪ పర్వము ౧౭ - ౧౮ వచనములలో దేవుడపరాధినిసెంతమాత్రమయిననిరపరాధిగ జేయడనిచెప్పబడియున్నది. గనుక నందుకువిరోధముగా బహుజనులుచేసినపాపములకు బదులుగ మఱియొకనిన నేకవిధమయినశిక్షజేసి యాశిక్షచేత వారియందఱిపాప

ములనెట్లు మన్నించి రక్షించును. అటుల మన్నించిన యెడల భగవంతున కస్వోక్తి విరోధము గాదా, యింతియే గాక, యపరాధము జేయని వానినివాని సమ్మతిచేత నయినను, మఱియొకని యపరాధమునకు శిక్షించుట మిక్కిలి స్వోక్తి విరోధముగా నున్నది గనుక నిది సరిగాదు. ఇందుకు దృష్టాంతము దేశాధిపతి తనకు లోబడిన యొక మనుష్యుడు నరహత్య జేసినందున నందుకు వాని తండ్రి పుత్రవధమును సహింపజాలక పుత్రునకు బదులుగా దన్ను జంపు మని యొప్పుకొన్న నధికారులెక్కడ నయినను నరహత్యజేసినవానికి బదులుగ వాని తండ్రిని జంపుదురా, యిందువలన క్రిష్టియనులు చెప్పెడి పాపములయొక్క మన్నింపు క్రమమయినది గాదు, నేను జెప్పెడిది క్రమము, వారు జెప్పెడిది యక్రమమని దెలిపెదు నొక దృష్టాంతము జూపించుచున్నాను, దేశాధిపతికి బుత్రుడైన వాడు తప్పు జేసి తండ్రిని వేడుకొంటే దయచేత శిక్షింపక విడుచునే గాని పుత్రుని నేరమునకు బదులుగా నా పుత్రునికి మిత్రుడైన వాడు తన్ను శిక్షింపుమని చెప్పుకొనిన నా దేశాధిపతి వాని శిక్షించునా, యిందువలననే వారు చెప్పెడి పాపపు మన్నింపు క్రమమైనది గాదని స్ఫుటముగా దెలిసికొన వచ్చును, భగవంతుడు మిక్కిలి దయగలవాడని సర్వమతస్థులొప్పుకొంటున్నారు గనుక తన్ను గాని తన ముఖ్యభక్తులను గాని నమ్మి తన నామస్మరణము సేయు వారి పాపములను మన్నించి రక్షించుచున్నాడని చెప్పుట కేయాక్షేపమున్ను లేదు.

## భగవన్నామమహిమ అర్థవాదము కాదనుట.

అయితే, భగవదాజ్ఞా ప్రకారమునడువక నామస్మరణము జేసి తేయాయనకు దయవచ్చునా, గనుక మీ శాస్త్రములలో నామమహిమ జెప్పియుండుట అర్థవాదమని చెప్పుచున్నారు, అటుల చెప్పగూడదు ఏలనంటేని, నామాపరాధములను జెప్పియుండెడి విశేష శాస్త్రము

లలో నామమహిమ యందర్థవాదభ్రమ కూడదనియు, కలిలోనామస్మరణమే విశేషమనియుఁ జెప్పియున్నందువల్లనున్ను, శ్రుత్యాదులయందు నవశనామ స్మరణము వలనసర్వపాప నివృత్తియగునని చెప్పబడినందువల్లనున్ను, అజామీళచైద్యాదులు నామస్మరణము వలననే సర్వపాపవిముక్తులై ముక్తినిజెందినట్లు చెప్పబడియున్నందు వల్లనున్ను అర్థవాదమని చెప్పగూడదు. ఇంతియేగాక, లోకములో విశేషాపరాధమును జేసి నీవేగతియని వేడుకొన్నప్పు డెంతకఠినచిత్తునకయినను దయవచ్చునప్పుడు మహాదయాళువైన భగవంతునకేల దయగలుగదు. ఇంతియేగాక, యాయనయాజ్ఞ యున్నైయున్నది, ఇందుకువారి బైబిల్ గ్రంథంబునందును యోహానుగ౧౪పర్వం ౧౩-౧౪ వచనములలో క్రీస్తే తననామకీర్తనము సేయుమని చెప్పినట్లున్నది. కనుక నామకీర్తనము ముఖ్యమైయున్నది. శ్రుతిస్మృతీతిహాసపురాణములలో బరస్పరవిరుద్ధములుగ గనుపడెడు నంశములను మతాభిమానులయినవారనేకవిధములుగ వివరించియున్నారు. కనుకనిట్టివిరుద్ధాంశములను సామరస్యముజేసియు విమతస్థులయినవారు వైదికమయిన యీభగవన్మతము మీదజేసెడునాక్షేపములనుబరిహరించియు, దత్వనిర్ణయములోమలకుదెలుపుటకై యీగ్రంథమురచింపబడినదిగనుక, విరుద్ధములుగగనుపడనిపంచీకరణాది తత్వాంశములును, యోగాదిశాస్త్ర రహస్యములును, నిందులో వివరింపబడలేదు. ఆయాయంశములాయాతత్వశాస్త్రములలో జూచుకొనవలయునది, యీగ్రంథము విస్తారమగుచున్నదనుహేతువుచేత సంగ్రహముగను, బ్రతిపదము ప్రతి విశేషణము సాభిప్రాయముగను, భావము విస్తారముగానుండునట్లు వ్రాసియున్నది, కనుక నీగ్రంథమునుజూచువారు నాయందుదయయుంచి తమతమ మతములయందుఁ బక్షపాతములులేకుండ మొదటినుండి తుదివరకు నెమ్మదిగ బలుమారుజూచి ప్రతిపదములోబ్రతివిశేషణములోగలిగియుండెడు భావములనుజక్కగ

బోధపఱచుకొని రేని మొదలజెప్పిన విరోధాంశముల కన్నిటికి బరిహా రముగలిగి తత్వనిర్ణయము గలుగుచున్నది.

—॥ సర్వజనంబులంగీకరింపదగిన ముఖ్యాంశములు. ॥—

ఈగ్రంథావలోకనము వల్ల నేర్పడు సారాంశములు. ఏదేశస్థుల నైన నేమతస్థులనైన నేకులస్థులనైనను నేశ్వరమతస్థులకుసర్వసాధా రణములుగ నంగీకరింప దగినయంశములాఱుగానున్నవి, యవియెవ్వి యనిన.

౧, ఇంద్రియ గోచరములయిన పదార్థము లన్నియు, నచి ద్రూపములనియు.

౨, నీదృశ్యమానపదార్థములలోనుండి వృద్ధ్యాదుల, జేయు చున్నట్టి చైతన్యము బోయిన వెనుక నట్టి వృద్ధ్యాదులు లేకుండుటచేత దీనింబట్టి యచిత్తుకంటెను వేరుగాచిత్తు ఒకటియున్నదనియు.

౩, నీచిదచిత్సంబంధములచేత విచిత్రమయిన ప్రపంచమును జేసితత్తత్కాలానుగుణముగ భూతకోట్లకు నదృష్టాధీనము లయిన సుఖ దుఃఖ ఫలముల నిచ్చుటకు గారణ మయిన యీశ్వరు డొకడున్నాడనియు.

౪, దేహముయొక్క బాహ్యమాలిన్యము పోగొట్టుకొని పరి శుద్ధముగనారోగ్యముగ నుండుటదియే శౌచరూపాచార మనియు.

౫, యోగ్యులగు బహుజనులు మంచివని యెంచునట్టి కార్య ములు సేయుటదియే ధర్మమనియు.

౬, జగత్కారణమయిన యీశ్వరుని దనకుసాధ్యమయినరీతి చేతనమ్ముటయే తాను కడతేరుటకు సాధకమనియు, నివి ముఖ్యోపాదేయములు.

—✽ బాహ్యమలనివృత్తియే, శౌచరూపాచారమనుట. ✽—

అయితే, శౌచాచార కర్మములనాచరించుటయందు నేమాత్రములోపము సంభవించినను బ్రత్యవాయమని శాస్త్రములలో జెప్పం బడియున్నదే, కేవలము దేహముయొక్క బాహ్యమల నివృత్తియే శౌచరూపాచారమని చెప్పుటది విరుద్ధముగాదా యనియంటేని, యటుల విరుద్ధంబుగాదు. ఎందువలననంటేని, వైదికశాస్త్రములలో బరస్పరవిరుద్ధములుగ ననేకశౌచాచారవిధులు విధింపబడియుండుటవలన, నారీతి నాచరింపబడుచున్నవి, వైదికమతస్థులే, దేశకాల మతభేదములచేత బరస్పరవిరుద్ధాచారములను సదాచారంబులుగ నంగీకరించి యున్నారు. మఱియు నవైదికులైన మహంమదియ్యానులు హూణులు మొదలైనవారు అధశ్శౌచాదులనుజలంబులచేత జేసినయెడల నాజలము పరంపరా సంబంధమువలన వస్త్రమునకు, దేహమునకునంటునని, మంటిపెళ్లలతోను గాకితములతోను బరిశుద్ధము జేయుచున్నారు, ఎవ్వరెన్నివిధంబుల చేత నాచరించినను బాహ్యమాలిన్యనివృత్తి యేయగుచున్నదిగానియంతర్మాలిన్యనివృత్తి గానియాత్మకుబరిశుద్ధిగాని గలుగనేరదు, మఱియుముక్తికాదు, లశుద్ధపదార్థమందును దనదేహమందును, బరోచ్ఛిష్టమందును, డానారగించెడున న్నంబునందును, బ్రాలినప్పటికినినశక్యవిషయమగుటచేత నదిదోషావహముగాదని శాస్త్రములోనిర్ణయింపబడియున్నది. మఱియును స్త్రీబహిష్ఠయైనప్పుడు రజోదర్శనము కంటెబూర్వమందును, త్రిరాత్రములకంటె బరమందునురజస్రావమగుచున్నప్పటికిని దోషావహము గాదనియు, నడుమమూడు దినములుమాత్రముస్త్రీలనంటి రేని ప్రత్యవాయమనియు జెప్పబడియున్నది. యిట్లుభయకల్పనజేసి చెప్పినశాస్త్రమునకు మూడురాత్రులకులో పలస్త్రీలతోసంసర్గము జేసినయెడల నుష్ణాధిక్యమువలనరోగములు గలుగుచున్నవనివైద్యశాస్త్రములో జెప్పబడియున్నందున స్పృశింపగూడదనిభా

దాజ్ఞారూపమయిన శాస్త్రములో బుణ్యపాపములు నిర్ణయించి యుండువాళ్లకు భావము. భగవల్లీలారూప ప్రపంచములో నుండెడి భూతములకు దృప్తికరముగ, వృద్ధికరములుగ నుండెడి ధర్మములు చేయుటయే పుణ్యకర్మములనియును భూతముల కతృప్తికరములుగ హింసారూపములుగనుండెడి కర్మములుచేయుటయే పాపకర్మము లనియునునిర్ణయింప వలయునది. ఇందువలన భూత తృప్త్యతృప్తి ద్వారముగా నీశ్వరునకుఁ బ్రీత్యప్రీతులుగలుగుచున్నవి, గనుక కాలదేశకులమతానుగుణముగ బుద్ధిమంతులు మంచివనియెంచునట్టి కార్యములుచేయుటదియే ధర్మము. యీయంశములే బుద్ధిమంతులయిన వారు సమస్తశాస్త్రములలోనుండి ముఖ్యముగ గ్రహింపవలయును. ఇందుకు బ్రమాణము, గీతాశాస్త్రములో ద్వితీయాధ్యాయమందు. (శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే । తావాంత్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్యవిజానతః॥) అనియున్నది. ఈయాటింటిలోముఖ్యమయినదియొకటి, యదియెద్దియనగ, గారణమయినయీశ్వరునినమ్మి సాధ్యమయినరీతిచేత నుపాసించుట, అట్లుపాసించు వారికెవ్విశ్రేయస్కరములయినవో, వాటిని ఆభగవంతుడే గలుగజేయుచున్నాడు, ఇదినిశ్చయము.

## ఈగ్రంథాభిప్రాయము నెఱుంగనివారు.

అయితే, నిరీశ్వర మతస్థునకును, మతాభిమానము గలవానికిని, నిష్పక్షపాతముగదత్వశాస్త్రములను శోధింపనివానికిని, వివేకము లేనివానికిని, నీగ్రంథముశ్రద్ధతో జూడనివానికిని, నసూయగలవానికిని, వీరలకీగ్రంథాభిప్రాయమంతయు దెలియదు.

## భగవత్తత్వమునెవ్వరెఱుంగరనుట

అయితే, మహారహస్యములయిన యీభగవత్తత్వములనునీవు

మాత్రము చక్కగాదెలిసికొని చెప్పితివాయనియంటేని, శ్రీభాగవత దశమస్కంధములో సప్తాశీతితమాధ్యాయమందు. (శ్లో॥ ద్యుపతయ ఏవ తేనయయురంతమనంతతయా త్వమపియ దంతరాండ నిచయా నను సావరణాః । ఖఇవరజాంసివాంతివయసా సహయచ్ఛ్రుతయ_స్త్వయి వాఫలంత్యతన్నిరసనేనభవన్నిధనాః॥) అని యెడి శ్లోకము చేత నిట్లుభగ వంతుడనంతుడగుట వలననాయన తత్వముల నింద్రాదులు గుర్తెఱుగ లేరనియు, భగవంతుడును గుర్తెఱుగ లేడనియు, శ్రుతులునుసప్రకా రముగ బ్రతిపాదింప జాలక నామరూపాత్మ కాతన్నిరసనముచేత భగవంతునియందు ఫలించుచున్నవనియు జెప్పబడియున్నది.

అయితే, భగవంతుడు తనయంతమును గుర్తెఱుగ లేడను పక్ష మందాయన సర్వజ్ఞత్వమునకుహానిరాదాయనియంటేని, అనంతుడైన తనయొక్కయంతము నెరుగడనునది యాయన సర్వజ్ఞత్వమునకుహాని గాదు, యిట్లింద్రాదులేగుర్తెఱగరనునప్పుడు నేనుమాత్రము గుర్తెఱుగుదునని యెంచిచెప్పిన వాడనుగాను.

అయితే, కారణమయిన భగవంతుడొకడున్నాడని మాత్రమ నేకప్రమాణములచేత దృఢముగాజెప్పగలను, అట్టి భగవత్ప్రేరణము వలననాకుదోచిన భగవత్తత్వములను వివరించి యీగీతార్థసారసం గ్రహమనెడు గ్రంథమునువాక్యరూపంబుగ రచించినాడను.

## ఈగ్రంథముభగవన్మతానుసారియనుట.

అయితే, యీగ్రంథమేమతమునకు సంబంధించినది కాదేయని యంటేని, శ్రుతిస్మృత్యాది స్వరససిద్ధములై యుక్తిసహము లయిన యంశములను సర్వమతములలో నుండి సంగ్రహించి భగవన్మతాను సారిగనేర్పఱపబడినది. గనుక నింమలోని శాస్త్ర స్వారస్య యుక్తుల కన్ననధికంబుగ శాస్త్రస్వారస్యయుక్తులచేత దత్వాంశములు వుంటే

యొకవిధంబుగ, సిద్ధించెనేని యవియును భగవత్తత్వములే గనుక, భాగవతుండనయిన నాకుపాదేయము లేను, ఈగ్రంథములో వ్యత్యాసములున్న యెడల నాహృదయాంతర్వర్తియై బుద్ధిప్రేరణము జేసిన సర్వకారణ కారణస్వరూపుడై సర్వాత్మకుడయిన శ్రీకృష్ణులే క్షమించి రక్షించుచున్నాడని నమ్మియున్నాను.

అయితే, లోకములో మనుష్యుడైనవాడు తాను బ్రతికియుండుటకు దగిన కార్యములను జేయ వలయు నది గనుక నేను ఇహపరంబులందు సదాసర్వత్ర బ్రతికియుండుటకు నీగ్రంథమునురచించినానేగాని, యితరు లీప్రకార మనుష్ఠింప వలయుననెడి దురభి సంధితో రచించిన వాడనుగాను.

సదా సర్వత్ర బ్రతికియుండుట.

అనగా నిహమందు.

నా తదనంతరమున్ను గ్రంథ ముంటున్నది గనుక, సదాయున్ను, బ్రపంచమంతట నీగ్రంథము వ్యాపించుటవలన సర్వత్రయును నుండుటే బ్రతికియుండుట.

పరమునందు.

బ్రహ్మముతో నైక్యమై, సదా యనగా త్రికాలా బాధ్యత్వముగాను, సర్వత్రయనగా నంతట బరిపూర్ణముగాను, నుండుట. యిదే బ్రతికియుండుట, యనిభావము.

---

శ్రీ భగవద్గీ తా ర్థ సా ర స ం గ్ర హ ము.

స ం పూ ర్ణ ము.



ఓం

శ్రీరాములు.

శ్రీరాధాకృష్ణాయనమః.

## సారాంశపంచకమనుగ్రంథము.



ఇదివరలో నేను జెప్పిన గీతార్థ సార సంగ్రహ మనెడి గ్రంథము శ్రుతిస్మృత్యాది స్వరస సిద్ధములై యుక్తి సహము లయిన యంశములచేత నేర్పరపబడినది గావున, వేదబాహ్యులు దానినొప్పు కొనరు. అందువలన సర్వసమ్మతముగా నీసారాంశ పంచక మనెడి గ్రంథమును రచించుచున్నాడను. లోకములో బ్రత్యక్షానుమానప్రమాణములే ముఖ్యములుగానిశబ్దప్రమాణముముఖ్యముగాదు. అటులశబ్దము ముఖ్యమయ్యెడి పక్షములో ననేకమత సంబంధములైన తత్వనిర్ణాయక శాస్త్రములలో బరస్పర విరుద్ధములయ్యెను, యుక్తిసహములుగాకయు, నందుభాగములన్నియును యథార్థములు కావలసివచ్చును. అట్లుకాఁజాలవు, ఎందువలననంటేని, జగత్సృష్ట్యాది తత్వము లేకరీతిగ నుండునేగాని. వారివారి మతరీతిని భిన్న భిన్నములుగా నుండవుగదా. అందువల్ల బ్రత్యక్షానుమాన ప్రమాణములేముఖ్యములు. వీట్లను బట్టి లోకన్యాయ సిద్ధముగా జెప్పబడుసారాంశ పంచకమేమనిన. అచిత్తు ౧ చిత్తు ౨ ఈశ్వరుడు ౩ అట్టియీశ్వరునినమ్మియనుసరించుట ౪ అటుల నమ్మినవారికేది శ్రేయస్సో దానిని భగవంతుడు గలుగజేయుట ౫ ఇందులవివరము.

౧, ఇంద్రియగోచరములైన పదార్థములన్నియు నచిద్రూపములు.

౨, స్థావరజంగమాత్మక స్వరూపములలో చిత్తు ఉండువరకు వాటికి వృద్ధ్యాదులు గలుగుచును, జీవవియోగానంతరము వాటికి వృద్ధ్యాదులు లేకపోవుటవలన నచిత్తుకంటె చిత్తు వేరుగానున్నదని యనుమాన ప్రమాణముచేత నిర్ణయింపదగియున్నది.

౩, ఈ చిదచిత్సంయోగము వలన విచిత్ర ప్రపంచ సృష్టి జేసి ప్రపంచవృద్ధ్యాదుల కొఱకు దత్తత్కాలానుగుణముగా వర్షాదుల నిచ్చుచునుండుటకు నొకయీశ్వరు ననుమాన ప్రమాణము చేత నొప్పవలసియున్నది.

౪, ఎప్పుడు చిదచిత్తులకు నీశ్వరుడొకడేల్పడెనో యప్పుడట్టియధికారిని నమ్మి విధేయత గానడుచు కొనవలసినది న్యాయముగానున్నది యెట్లనగా భగవంతుడు తనలీలార్థమై సృష్టించిన ప్రపంచమున కహింసారూపములై వృద్ధికరములై యాయామనుష్యునికి సాధ్యములై సుఖావిరుద్ధములై - శుచికరములై, యాయాకాలదేశ మతానుగుణములై పదుగురు బుద్ధిమంతులైన వారు మంచివని యెంచెడు లోక హిత కార్యములను జేయుటయే భగవంతునికి విధేయత గానడుచుకొనుటయి దేధర్మము, ఇందుకుపాయము:- భగవంతుని నామరూపములు ప్రత్యక్షసిద్ధములు గానందున మనుష్యునకును వలెనే గుర్తు కొరకు ఆయనకు అసాధారణమైనయొకపేరు బెట్టి కారణాభిసంధితో ఆనామమును సర్వదా స్మరింప వలసినది. ఆలాగు స్మరణ సర్వదా సేయుట వలన భగవంతుని

యందు సర్వదా జ్ఞప్తియుండి భయముతో నాయనకు
ప్రీతికరములయిన లోకహితకార్యములను జేయుటకు
హేతువగుచున్నది. అట్లునమ్మినవారలు కామక్రో
ధాదుల వలన నవశులయిచేసెడు దోషములను భగ
వంతుడు మన్నించుచున్నాడు, ఇందుకు దృష్టాంతము.
లోకములో నొకరాజును నిజముగా నమ్మి సర్వదా
వారికి హితములయిన కార్యములనుజేసెడు భటుని
వల్లగలిగిన ప్రామాదిక దోషములను రాజుమన్నింపు
జేసిన రీతిగా మన్నించుచున్నాడు.

౫, ఇట్లు నమ్మినవారికేది శ్రేయస్సోదానిందదను గుణ్య
ముగా భగవంతుడు గలుగ జేయుచున్నాడనియు
నందుకు వ్యతిరేకము జేసిన వారికేది యశ్రేయస్సో
దానిందదను గుణ్యముగా భగవంతుడే గలుగ జేయు
చున్నాడనియు నూహింపదగియున్నది.

ఆశంక ❀ అయితే, భగవంతునికి విధేయుడై లోకహిత కార్యములను జేయవలయునని చెప్పితిరిగదా, అట్లుచేయుటకు, కర్త జీవుడా, లేకదేహమా, సుషుప్తిమూర్ఛాదులయందు జిత్తునకుగాని, యప్పుడచిద్రూపమయిన దేహమునకుగాని యేసామర్థ్యము లేకుండుట ప్రత్యక్షసిద్ధమైయుండగా, దేనినిగురించి విధించుచున్నావనియంటేని, సమాధానము. నీవుచెప్పిన ప్రకారము సుషుప్తి, మూర్ఛా మాదకవస్త్వధిక సేవనమువలన గలుగువిస్మృతి, యివి మొదలయిన వాట్లయందు కేవలము చిత్తునకుగాని, యచిద్రూపమయిన దేహమునకు గాని, యేసామర్థ్యము లేకుండుటసత్యమేను, అట్టిసుషుప్త్యాద్యవస్థల లో, నాత్మకు మనస్సంబంధము లేనందుననే జ్ఞానము గలుగనేరదు. ఆత్మకు మనస్సంబంధము గలిగినప్పుడు జ్ఞానము గలుగుచున్నది, అట్టి

మనస్సంతర్ముఖముగా నుండెనేని స్వప్నాదులును, బహిర్ముఖమైతే జాగ్రదాదులును గలుగుచున్నవి. అట్టిజాగ్రదవస్థయందును చిత్తాది వికారములవలననేమి మాదకవస్త్వల్పసేవాదులవలననేమి మనస్స్వాస్థ్యము లేకపోయినందుననేమి, బాల్యమందుమాననేంద్రియాదిస్ఫూర్తి లేకపోయినందుననేమి, జీవునికివివేకము గలుగకయుంటున్నది. కావున నేప్రతిబంధకములేని మనస్సుతో సంబంధించి జాగ్రదవస్థలోనుండెడి జీవునినుద్దేశించి విధింపబడినది.

ఆశంక ॥ అయితే, చిత్సంయోగముగల ప్రకృతిసంబంధము లయిన పంచభూతములయొక్కయు సత్వరజస్తమోగుణములయొక్కయు మేళనవ్యత్క్రమభేదములచేత బహుపశ్వాదులకు దత్తజ్జాతినిష్ఠము లయినరూపభేద కంఠనాద భేదములేమి, వివేకముగాని శిక్షయుగాని లేకనేతత్తత్కాలానుగుణముగానవి చేయుకార్యములేమి, మఱియు మనుష్యులలోనున్న పరస్పరరూప భేదకంఠనాదభేదములేమి, వివేకముగల్గి శిక్షితులయ్యును కామక్రోధాదులవలన వారుసేయునకార్యము లేమికలుగుచునుండునప్పుడు కర్తృత్వము నట్టిప్రకృతికివిధింపకజాగ్రదవస్థయందుండెడి జీవునికి విధించుట న్యాయముగా నుండలేదని యంటేని, సమాధానం, నీవుచెప్పినప్రకారము ప్రకృతిగుణములకు నెంత సామర్థ్యము గలిగియుండినను ప్రకృతి యచేతనముగనుకనున్నూ సుఖదుఃఖములకు భోక్తజీవుడేగనుకనున్నూ జ్ఞానముచేతనున్నూ అభ్యాసముచేతనున్నూ కామక్రోధాదులనుజీవుడు కొంతనిగ్రహించుట యనుభవములోనుండుటచేతనున్ను జాగ్రదవస్థలోనుండిన జీవునికేవిధించుట న్యాయముగానున్నది. యెగువ జెప్పినప్రకారము చిదచిదీశ్వరులయొక్కతత్వములనువాటికార్యములను తెలిసికొనుటయే పరమయినజ్ఞానము. ఇట్టిజ్ఞానమువలన కేవలజీవునికి కర్తృత్వాభిమానము నివర్తించుచున్నది గనుక యట్టిజీవునికి నేపుణ్యపాపములంటవనియొప్పదగియున్నది.

యీసిద్ధాంతమున కేవిరోధంబునుం గలుగనేరదు.

ఆశంక ః ఈశ్వరుడున్న పక్షమం దీశ్వరుడున్నట్లయితే రక్షించు చున్నాడుసరే, ఈశ్వరుడులేనిపక్షమం దతనిన్నమ్మి చేసిన కార్యము లన్నియు వ్యర్థములే గదా, యని యంటేని. సమాధానం, అటుల యీశ్వరుడు లేకపోవుట యేమతములయందును సిద్ధింపదు. ఎట్లంటేని, నిరీశ్వరమతములవారుకూడ, నీప్రపంచముస్వభావమువలనగలుగుచున్న దనికొందఱు, కాలమువలనగలుగుచున్నదనికొందఱు, కర్మమువలన గలుగుచున్నదనికొందఱు, భ్రాంతివలనగలుగుచున్నదనికొందఱునిటుల నింకననేకరీతుల జెప్పుచున్నారు. అట్లువారుచెప్పెడిప్రకారము స్వభావమేబ్రహ్మమనియు, కాలమేబ్రహ్మమనియు, కర్మమేబ్రహ్మమనియు, భ్రాంత్యధిష్ఠానమేబ్రహ్మమనియు నింకాప్రపంచమునకు కారణమేదే దనిచెప్పుచున్నారోయదేమేము బ్రహ్మమనిచెప్పుచున్నాము గనుకయిం దువలన నీశ్వరుడు లేకపోయినట్లులేపడదు.

ఆశంక ః అయితే, యిట్లుయెంచబడెడునీశ్వరుని నమ్మియుపాసనజేసితే ప్రయోజనమేమనియంటేని. సమాధానం, అట్టియీశ్వరునికి నిగ్రహానుగ్రహములుండనీలేకపోనీ, మఱియుశాస్త్రములలోఁ జెప్పియున్న ప్రకారము జీవునికి బంధమోక్షములుండనీ. లేకపోనీ, స్వర్గనరకాదులు ండనీలేకపోనీ, జీవేశ్వరులకు భేదమేగాని యభేదమేగాని యీప్రపంచము సత్యముగాని. మిథ్యగాని, యింకాయేది యెట్లులుండినను లేకపోయినను, నీశ్వరుడున్నాడని భయపడిలోకహితకార్యములను జేయుటతప్పుగాదు. ఏలనంటే యీశ్వరుడుండి యాయనకు నిగ్రహానుగ్రహ సామర్థ్యమున్న పక్షములోనమ్మిన వారికిప్రయోజనముగలదు. అట్లులేనిపక్షములో లోకహితమును జేయుటవలన లోకములో వాడుకీర్తినైనను బొందుచున్నాడు, నిరీశ్వర మస్థుడై తేనో యీశ్వరుడున్న లేడని నిర్భయముగా గామక్రోధాదులవలన లోకదూ

వ్యకార్యములను జేయుట చేతనీశ్వరుడున్న పక్షములో నశ్రేయస్సును బొందుటేగాక, యీశ్వరుడు లేని పక్షము లోనున్నా లోకములో నిందితుడై యపకీర్తిని బొంది శిక్షనుం బొందుచున్నాడు. గనుక యెన్నివిధములనైన భగవంతుడున్నాడని నమ్మివారివారి మతసంకేతసిద్ధములైన నామములచేత గారణాభిసంధితో నతనిని సర్వదాస్మరించుచు జీవులకు ప్రాణాధారమైన యన్నాదుల నీశ్వరుని ప్రీతికొరకు దనశక్త్యను సారంబిచ్చుచునుండుట ముఖ్యము సులభమునుగాన నిట్లు చేయువాడెప్పటికిం జెడడు.

సర్వమతములలో నుండెడి సమస్తసారాంశము లీమైదంశములలోనేయంతర్భూతములుగావున సర్వజనులకునివి యుపాదేయములుగనుక సులభముగా దెలియుటకు సంగ్రహముగా దెనుగుమాటలతో నీసారాంశపంచక మనుగ్రంథమురచించుటయైనది.

సారాంశపంచకము సంపూర్ణము.

శ్రీరాధాకృష్ణార్పణమస్తు.

